# వారణాసి  శ్రీ రామ కృష్ణ {అమరావతి} - కథలు

## 22-02-2024 to 7-04-23



## 1- మీకేమిటి స్ఫూర్తి ?      7-4-24

మన తెలుగు వాడే అయిన జేబు దొంగ ఒకడు ప్యారీసు వెళ్లి అక్కడ జేబులు  కట్ చేస్తూ

పోలీసులకు పట్టు బడ్డాడు . జెయిలులో వేశారు . కానీ మన వాడు జైలుకుండా ఒక స్వరంగ మార్గము తవ్వి బయట పడ్డాడు . పోలీసులు మనవాడిని మళ్ళీ పట్టుకున్నారు .

" నీకు అన్నం తినటానికి అని ఇచ్చిన పళ్ళెము ,ఫోర్క్ స్పూన్ పెట్టి నువ్వు  స్వరంగం తవ్వుకున్నావు ? ఇలా చేయటానికి నీకేమి టి స్ఫూర్తి ? అని అడిగారు పోలీసు వారు .

దొంగ ఇట్లా అన్నాడు " మా దేశములో సాంబారు ఇడ్లీలు అని ఉంటవి . ఒక సింగల్ ఇడ్లీకి బకెట్ సాంబారు పోయించుకొని - ఒక చిన్న స్పూనుతో , ఆ బకెట్ సాంబారును ఐదు నిమిషాలలో  .   ప్లేట్ లోనుండి తోడి నోటిలో వేసుకుంటాము . దీనిని మా దేశములో అందరూ సాధన చేస్తారు .  ఆలా చేసే వాళ్లకు   ఈ స్వరంగం కోసం  మట్టి తోడటం ఏమి ఛాలెంజ్? ఏమి  లెక్క ? అని స్ఫూర్తి తెచ్చుకొని

చెంచాతో మట్టి తవ్వి పడేసి  స్వరంగం చేసుకుని బయట పడ్డాను " అన్నాడు .

ది ప్యారిస్ డైలీ అనే  పత్రిక " సాంబారు నుండి - సొరంగ స్ఫూర్తి " అనే వార్తా కధనం  అచ్చు వేసింది .అప్పుడు  ప్యారిస్లో సాంబారు ఇడ్లీలు ప్రవేశ పెట్టరాదని నిషేదించారు .ఇప్పటికి ప్యారిస్లో సాంబారు ఇడ్లీలు లేకపోవటానికి మనవాడే కారణం .

——————————————————————————

2- మీ వాడిని  తెగ వాడేసుకుంటున్నారు
5-04-24

ఇది మా అమరావతిలో  ,  నా మూడు జన్మల కిందట జరిగిన  ముచ్చట .  మాకు ఒక గురువు గారు వున్నాడు .   వాళ్ళకో అబ్బాయి వున్నాడు . మేము అతడిని కుమార గురువు అంటాము . అతడూ మేము కలిసి   వాడి  తండ్రి గారి వద్ద మంత్రం తంత్రం- యంత్రం - గుప్తం  అనే  విద్యలు నేర్చుకుంటూ వుండే వారము .  కుమార గురువు

మా కన్నా ఒక ఆకు ఎక్కువ నేర్చుకున్నాడు . ఒక నాడు మేమందరమూ ఒక చెట్టుకింద కూచుని - అతని సలహా మీద కుంపటిలో తడి బొగ్గులు వేసి మండించాము . మంటకు బదులు వచ్చిన తెల్లని పొగలోకి - మా కుమార గురువు పసుపు కుంకుమలు- విభూది చల్లాడు . అప్పుడు చెవి పక్కన చేయి పెట్టుకున్న ది, పసుపు రంగు వస్త్రాలు కట్టుకున్నది , ఎర్రని దేహము కలది , తెల్లని మెల్ల కన్నులు వున్నది అయినా ఒక పిశాచం గాడు ఆ పొగలో కనపడ్డాడు .

" అదుగో మనం కోరుకున్నట్లు కర్ణ పిశాచం గాడు వచ్చాడు . వీడు ప్రపంచంలోని వింత వార్తలు అన్నీ తన చెవి ద్వారా విని, మన చెవిలో చెపుతాడు . మనము విందామా ? " అని మా కుమార గురుడు . అడిగాడు.

మేము -వూ- అన్న మీదట " ఓరీ కర్ణ పిశాచీ . గరుడ గమన- విమాన యాన విద్యల్లో నిష్ణాతుడైన

మా అన్న గారైన  అన్న పూర్ణయ్యకు ఒక వుద్యోగం చూడమంటిని . చూస్తివా ? అని అడిగాడు .

కర్ణ పిశాచీ చెవు గీక్కోని " అక్కడెక్కడో  డెర్మనీ దేశంలో ఒక రాజు  వున్నాడు సామీ.  ఆయనకు ఒక్కతే రాణి . ఆమె తరచూ పుట్టింటికి పోతూవుంటుంది . నెలల తరబడీ వెనక్కు రాదు . కోరుకున్నపుడల్లా పెళ్లి ఆమెను చూసి రావటానికి అని రాజు   గారు ఒక రెక్కల గుఱ్ఱము జన్మించేటట్లు చేసి - దాని మీదకు ఎక్కి గగన విహారం కూడా చేసాడు . అంతా బాగానే వున్నది కానీ అది రాణీ గారు ఉన్న చోటుకు పోలేకపోతూవుంది . కాసేపు ఆలా గాలిలో ఎగిరి మళ్ళా వచ్చి రాజమందిరం మీదనే దిగుతున్నది . రాణీ గారి ఇల్లు ఎక్కడ వున్నది ?  - ఏ దిక్కుగా బయలు దేరి వెడితే రాణిగారి ఇల్లు వస్తుంది ?? అనేవిషయాలు ఏవీ దానికి తెలుస్తలేదు . కారణం గుర్రానికి గానీ, రాజుగారికి  గానీ ఇదీ దారీ ,   ఇట్లా పోవాలి అని ఇంతకు ముందు ఎవరూ నేర్పకపోవటం వల్ల  ఇలా

జరుగుతున్నదని మంత్రులు కనిపెట్టారు .  దానికి నేర్పాలంటే ముందు ఎవరికన్నా తెలిసి వుండాలిగదా ? ఈ ఆకాశంలో దారులు ఏమిటో ఎవరికీ తెలీటం లేదు .  ఆకాశమార్గములో  గుఱ్ఱము ముందు ఎగురుతూ --  గుఱ్ఱము  పోవాల్సిన  దారి చూపించే వారికోసం రాజు  గారు  వెతుకుతూ వున్నాడు.  మీ అన్నగారు అన్నపూర్ణయ్య గారు  గాలిలో ఎగిరే గరుడగమన -విమానయాన  విద్యలో నిష్ణాతులు కాబట్టి ఆయన్ని డెర్మనీ రాజు గారి దెగ్గరికి పొమ్మనండి . అయన కొలువులో అతి చిన్న పనికే ముప్పై రోజుల జాబుకి  మూడువేల బంగారు నాణేల జీతము "  అని చెప్పాడు.

గరుడగమన విమాన యాన విద్య నేర్చిన అన్న పూర్ణయ్య - డెర్మనీ వెళ్లి అక్కడ "అన్నాపోయ్యా " అనే పేరున ఉద్యోగంలో కుదురు కున్నాడు .  తాను ఒక గరుడ పక్షిలా ఆకాశం లో ఎగురుతూ, రెక్కల గుఱ్ఱానికి దారి చూపుతూ  చెక్రవర్తి గారిని అయన రాణి మందిరానికి చేర్చాడు"అన్నాపోయ్యా ".

అప్పుడు రాణీ గారు బాగా సంతోషించి ,
"అన్నాపోయ్యా " ని భయ్యా ని పిలిచింది .అక్కడితో
మన వాడి దశ తిరిగి పోయింది .

ఒకనాడు మా కుమార గురువు కర్ణ పిశాచుని మళ్ళా
ఆవాహన చేసి " మా అన్న - అన్నపూర్ణయ్య
ఎప్పుడు వెనక్కి రానున్నాడు? మేము కర్ర బిళ్ళ
ఆడవలె అని కోర్కెగా వున్నది ? అదీకాక గోలీల
ఒలిఎంపిక్సు కూడా దెగ్గరకు వస్తున్నవి " అని
అడిగాడు .

అప్పుడు కర్ణపిశాచు డు " మీ అన్నలోని ఆ
విమాన యాన విద్యయొక్క గొప్పతనమును
గుర్తించిన ఆ డెర్మనీ చెక్రవర్తి గారు మీ అన్నగారి
కాళ్ళు కడిగి నెత్తిన చల్లుకొని - తన సింహాసనం మీద
కూచో పెట్టుకుని - భుజం తట్టి మరీ, మీ వాడిని
తెగ వాడేసుకుంటున్నారు . దానితో మీ అన్నగారు
" నేను అక్కడ వున్నపుడు నన్ను గానీ నా విద్యని

గానీ గుర్తించిన వారుగానీ,  వాడుకున్న వారు లేరు . ఇక్కడ ఈయన నన్ను చక్కగా వాడుకుంటున్నాడు .  ఇక నేను వెనక్కు వేళ్లను " అని నిర్ణయం తీసుకున్నాడు .  ఇప్పుడు  డెర్మనీలో అన్ని దిక్కులకూ ఎగిరి వెళ్లి రాగల గుర్రాలు వంద వరకూ వున్నవి . వాటికి మీ అన్నసే అధిపతి . మీరు కావంటే మీకో జోడా గుర్రాలను  పంపిస్తాను అన్నాడు . మీరు వెళ్లి మీ అన్నను చూసి రావచ్చును " అని చెప్పాడు .

మా  కుమార గురువు డెర్మనీ నుండి గుర్రాలను రప్పించాడు . మొన్న రాత్రి మేము  ఆగుర్రాల మీద ఎక్కి వాటి తోకలు మెలితిప్పి వేగంగా దౌడు తీయిస్తూ ,  నదులు సముద్రాలు , కొండలు గుట్టలూ దాటుకుంటూ,  డెర్మనీ వైపుకి దూసుకు పోయాము. పోయే  దారిలో ఒక భీకర తుఫానులో చిక్కుకొని - సముద్రములో పడి   మునిగి పోయాము . మునిగిన మమ్మల్ని సముద్ర కన్యలు రక్షించి మాకు చద్దన్నం పులిహోర తినిపించి - పాలు తాగించి - ఐస్క్రీములు

ఇచ్చి - వచ్చేటప్పుడు మళ్ళీ రండి- పెళ్లి లు గట్రా చేసుకుందాము అని చెప్పి వీడ్కోలు పలికారు . ఆ సంగతులు రేపు అంటే రేపే చెపుతాను అంటే నమ్ముతారా? సరా ?

——————————————————————————-

## 3- బీపీపీ ట్రీ - మాటలు 2-04-24

ఇప్పుడు మా అమరావతి వుంది కదా ? అది అప్పుడూ వుంది . అప్పటిలో మా వూరిలో పేదరాశి పెద్దమ్మ గారు ఉండేది . ఆమె తమ్ముడు పేదరాశి పాపయ్య గారు.

అయన కాశీ పెడుతున్నాను అని బయలు దేరి కన్యాకుమారి వేపు దారి తీసి , దారిలో తగిలిన కేరళ లోనే ఆగి . అక్కడ ఆయుర్వేద వైద్యం నేర్చుకొని ఇంటికొచ్చి - కాలు లేని కాకిలా దేశమంతా తిరిగి " కాశి" కి ఆవల ఉన్న కాశ్మీర్ నుండి ఆయుర్వేద

వైద్యము నేర్చుకొచ్చానని  మా  అమరావతిలో చెప్పుకున్నాడు .
అయన తన విశాలమైన ఇంటి పెరడు లోనే  ఒక ఖాళీ జాగా చూసుకొని అందులో ఒక మొక్కని నాటాడు .   అది కల్పవృక్షానికి వేలువిడిచిన వెల్లుల్లికి  సోదరి అన్నాడు . అది తోటకూర కాడలా రోజుకో రకంగా ఎదుగుతూ  తాటి  చెట్టంత పొడుగు అయ్యింది  .   దాని కాండము  బొప్పాయి మొక్కలా గా బోలుగా వుంది . .అరిటాకులంత ఆకులు వేసింది .  మునక్కాయలంత పొడుగు కాయలు కాసింది .
" ఇదేమి చెట్టు వయ్యా ? " అని వూరు వారు అడిగారు .
" ఇది బీపీపీ  చెట్టు అనగా రక్త పోటు చెట్టు అంటారు "

అప్పటి జనానికి రక్తపోటులు ఉండేవి,   కానీ దాన్ని గురించి అవగాహనా లేదు .అందు కని  రక్త పోటు అంటే ఏమిటి ? అని వారు అడిగారు .

" మీరు ఎవరి మీదనైనా  ఎగురుతూ వున్నా ,
కోపంతో రెచ్చి పోతూ వున్నా , భూమి మీచుట్టూనో -
మీరు భూమి చుట్టూనో , మీ చుట్టూ మీరూనో ,
తిరుగుతూ ఉన్నట్లు అనిపిస్తే దాన్ని రక్త పోటు
అంటారు " అని  పేదరాశి పాపయ్య గారు వివరణ
ఇచ్చారు .        ఊరి  కరణం  గారికి తల తిరుగుడు
వున్నది . ప్రజల మీద అరుస్తూ ఉంటాడు . అందరి
మీద ఎగురుతూ ఉంటాడు. అయన వచ్చి నాకు
బీపీపీ చూడండి అని అడిగాడు .

పేదరాశి పాపయ్య గారు,  ఇందాక మనము
చెప్పుకున్న బీపీపీ  చెట్టుకింద ఒక నులక
మంచము వేసి దుప్పటి పరిచి దానిపై కరణంగారిని
కోచో పెట్టాడు . దేనికైనా సరే పసుపు కుంకాలు
లేకుండా ఆరోజుల్లో ఏ పనీ జరిగేది కాదు.
.అందుకని పేదరాశి పాపయ్య గారు ఒక
నిమ్మకాయకు  పసుపు కుంకాలు అద్ది దాన్ని
కారణం గారి చేతుల్లో పెట్టి " దాన్ని పిసుకుతూ

వుండండి - ఎటువంటి పరిస్థితుల్లోనూ ఆపొద్దు " అని చెప్పాడు .

నిమ్మకాయ పిసుకుతూ వున్న కరణం గారు మంచం మీద నుండి జాన ఎత్తుకు అక్కడ నుండి మూరఎత్తుకు .  ఆతరువాత బార ఎత్తుకు లేచి చివరికి ఆ చెట్టు చివరి ఎత్తుకు లేచి ఆకులకు తగిలాడు . మొదట్లలో లేదు కానీ ఆతరువాత ఆయన  వేగం పెరిగింది . మంచానికి చెట్టు ఆకుల కు మధ్య బంతిలా ఎగిరాడు అనొచ్చు . ఆసులో కండెలా కదిలాడు అనచ్చు .  పిసకంగా పిసకంగా నిమ్మకాయ పగిలి పోగా ,   కరణం గారు వచ్చి దభేలున మంచం మీద  పడ్డారు . ఆ తరువాత ఆయన మీద ఆ  చెట్టు ఆకు ఒకటి రాలి పడింది . " హూ " అంటూ పేదరాశి  పాపయ్య గారు ఆ ఆకును అందుకుని దానిలో రాసివున్నది  మౌనంగా చదివాడు . అది ఈ నాటి మన  బీపీ రిపోర్ట్ లాంటిది అన్న మాట .

" మీ కు బీప్ చూడటం పూర్తి అయ్యింది - ఇహ పత్యం చెపుతాను " అన్నాడు పేదరాశి పాపయ్య గారు . ఆయన ఆలా అనగానే చెట్టు కాయ ఒకటి రాలి అయన చేతుల్లో పడింది ." ఇదిగో ఇదే మీకు మందు ఔషధము . ఈ కాయను మా పేదరాశి పెద్దమ్మకు ఇచ్చి వండించుకో తినండి . ఆమెకు మాత్రమే ఆ వంట విధానము తెలుసు. బీపీ చూసినందుకు , ఆకు కోసము అని , కాయ కోసము అని, మొత్తము మూడు పైసలు ఇవ్వండి - వంటనిమిత్తము అని పేదరాశి పెద్దమ్మకు రొండు పైసాలు ఇవ్వండి" అని పాపయ్య గారు అన్నాడు .
" ఆమ్మో ఐదు పైసాలా ? సర్కారు వారి మనిషినైన నా దెగ్గరనుండి నేనా ఈ నిలువు దోపిడీ ?అంటూ కారణంగారు లబ లబ లాడాడు . ఆయన డబ్బు ఇచ్చాడో లేదో నాకు తెలవదు .
సరే ఏది ఏమైనా గానీ బీపీ చూపించుకోవటానికి జనం రాసాగారు . జనం అని ఎందుకు అన్నాను అంటే - ఒక బీపీపీ రోగి తో పాటు - అతని కుటుంబ సభ్యులు , అతని చుట్టుపక్కల వారు- కాలక్షేపం

కోసం వీధుల్లో తిరిగే వూరివారు గూడ వచ్చేవారు. ఎందుకు వచ్చేవారు అంటే రోగి కిందకు మీదకు ఎట్లా గిలకొట్టుకుంటున్నాడో చూద్దామని- వినోదిద్దాము అని . వీరందరినుండి మనిషికి అర పైసా చొప్పున వసూలు చేయబడింది .రోగితో పాటు వచ్చిన వారు అందరూ డబ్బు కట్టినాకనే బీపీపీ చూడటం మొదలు పెట్టే వాడు పాపయ్య గారు .ఈ తెలివితో అయన ఆదాయం రోజుకు ఎనిమిది అణాలు అయ్యింది .

ఒక నాడు ఒకపల్లె టూరు ఆయన వస్తే ఆయనతో పాటు ఇంకా మరింత పల్లెటూరి వాడు ఒకడు వచ్చాడు .
"ఎందుకండీ ఆ పల్లె టూరు అయన ఆలా కొట్టుకుంటూ వున్నాడు ?" అని ఆ మరింత పల్లెటూరి వాడు అడిగాడు . వీడు మనవాడే . బీపీపీ గురించి పల్లె ప్రజలకు గూడ అవగాహన కలిగించాలన్న ద్రుష్టి పాపయ్య గారికి వున్నది. " ఆయనకు కొవ్వు ఎక్కువగా వున్నది _ అందుకే

ఆలా కొట్టుకుంటున్నాడని ఆకు చెబుతున్నది "
అన్నాడు .
"ఓహో కోపెక్కి కొట్టుకుంటున్నాడన్న మాట" అని ఆ
మరింత పల్లెటూరి వాడు ఆశ్చర్యా పడ్డాడు .
ఈ మరింత పల్లెటూరి వాడు రోజూ వచ్చి " తనను
ఆశ్చర్య పరిచిన రోగిని చూపి- అయన అలా
ఎందుకు కొట్టుకుంటున్నట్లు ? అని అడిగే వాడు .
"అధికార మదం తలకెక్కి- అందరి పనీ పెట్టేయాలి-
కొట్లో వేసేయాలి - అని కోరుంటూ ఆయన బీపీ
తెచ్చుకుని కొట్టుకుంటున్నాడు "అన్నాడు పాపయ్య
గారు
"ఓహో మదమెక్కి కొట్టుకుంటున్నాడన్న మాట"
అని ఆ మరింత పల్లెటూరి వాడు అన్నాడు.
ఒక నాడు ఒకయువకుడికి బీపీపీ చూసారు ." ఆ
కుర్రవాడు గదా ? ఆలా ఎందుకు కొట్టుకున్నట్లు ?"
అని మన మరింత పల్లెటూరి వాడు అడిగాడు .
" వాడు కొత్త అల్లుడు . అల్లుడిని అన్న ఫీలింగుతో
నరాలు బిర్రబిగిసి పోయి కొట్టు కుంటున్నాడు "

" అంటే బిర్రబిగిసి కొట్టుకుంటున్నాడన్న మాట  అని ఆ మరింత పల్లెటూరి వాడు   అన్నాడు.
పైదంతా చదివినాక - ఆ బీపీ ట్రీ మూలకంగా మనకు కొన్ని   కొత్త తెలుగు మాటలు పుట్టినవి అని గమనించారా?లేదా ?   అవి ఏమిటంటే,   కొవ్వెక్కి కొట్టుకుంటున్నాడు , మదమెక్కి కొట్టుకుంటున్నాడు , బిర్రబిగిసి కొట్టుకుంటున్నాడు , డబ్బు తలకెక్కి కొట్టుకుంటున్నాడు , పాపం  ముదిరి కొట్టుకుంటున్నాడు , కళ్ళు బైర్లు కమ్మి కొట్టుకుంటున్నాడు అనేవి ప్రముఖ మైనవి .

విచిత్రమైన కొన్ని తెలుగు నుడికారాలు వాటి పుట్టు పూర్వోత్తరాలు అనే దాని మీద ఒక రీసెర్చ్ రాయి అని మా మేనల్లుడు చిట్టా పవన మాధవ్ శర్మ అడిగాడు .
"ఈ కొద్దీ దానికి రీసెర్చ్ ఎందుకురా ? మనము ఊహించ లేక కొట్టుకుంటున్నామా ఏమి ? అని వాడికి చెప్పి,  ఇదిఊహించి  రాసాను .

---

## 4- స్త్రీ శక్తి

జపాను లో "సుమో లు" అనే కుస్తీ పట్టే వస్తాదులు వుంటారు. వీరి దేహాలు గున్న ఏనుగులు అంత ఉంటవి . నిన్న జపానులో జరిగిన ఒక సుమో కుస్తీ పోటీలో ఒక సుమో ఈ సంవత్సరానికి నెంబర్ వన్ గా గెలుపొందాడు . అతడిని టీవీల వారు పలకరించారు . తన విజయం మీద అతను టీవీ లకు చెప్పిన మాటలు ఇవి "నా తల్లి నా కాబోయే తండ్రిని ఎంచుకోవటం లో చూపిన స్త్రీ శక్తికి, నా పట్ల చూపిన స్త్రీ శక్తి పట్లా కృతజ్ఞుడై వున్నాను "

సుమో గారు "స్త్రీ శక్తి" అనే ఒక మాట వాడాడు ? అది ఏమిటి .

వివాహ వయస్సుకు వచ్చిన ప్రతి యువతీ లోనూ " నేను కనుక ఇతడిని వివాహము ఆడానంటే గొప్ప వారైన సంతానాన్ని పొందగలుగుతాను " అనే దైవ ప్రేరేపితము అయినా భావము కలుగుతుంది . ఇది ఒక స్త్రీ శక్తి. దీనికి అనుగుణంగానే స్త్రీలు భర్తను

ఎంచుకుంటారు . వివాహానికి సిద్ధ పడతారు . ఒక స్త్రీ ఎటువంటి ప్రలోభాలకు లోబడకుండా "తన స్త్రీ శక్తిని " వుపయోగించి తన వివాహము చేసుకోవటానికి ఏర్పరిచినదే స్వయంవరం . ఎంతో సాంకేతిక పరిజ్ఞనం చొప్పించి తయారు చేసిన రాకెట్ కు కూడా సఫలత విఫలత వున్నది . అలాగే స్త్రీ శక్తికి కూడా సఫలతా విఫలత వున్నవి . అందువల్ల ఎక్కడన్నా విఫలత ఉంటే దాన్ని చూసి ఈ స్త్రీ శక్తి అనే భావము చెత్త అనరాదు.

టీవీ లలో "షిన్ చాన్ " అనే కార్టూన్ సీరియల్ వస్తుంది . మీరు కనుక ఈ మాటకు అర్థం ఏమిటని ఇంటర్నెట్ లో వెతికితే " హృదయానికి చెందిన పిల్లవాడు " అని అగుపిస్తుంది . స్త్రీ శక్తి స్త్రీ హృదయములోనే వున్నది .అంటే ఒక స్త్రీ హృదయము లోని "స్త్రీ శక్తి " కోరుకున్నట్లు పుట్టిన పిల్లవాడు షిన్ చాన్ .
ఈ కార్టూన్ సీరియల్ లో ఒక చిన్న పిల్ల " నాలో స్త్రీ శక్తి లేదన్నారు " అంటూ విలపిస్తూ " " నాకు స్త్రీ శక్తి కావలి . అది ఎక్కడవుంటుంది ? నాలోకి ఎట్లా వస్తుంది ? అని - షిన్ చాను ను మరియూ అతని మిత్రులను అడుగుతుంది .

"చిరు నవ్వు నవ్వటం - శాంతంగా ఉండటం - మంచి మనస్సుతో ఆలోచించటం -
ఇతరుల కష్టాలకు స్పందించటం - స్నేహంగా వుండటము , మిత భాషిగా వుండటము , కుటుంబము పట్ల భాద్యత వహించటం వంటి గుణాలు అన్నింటినీ నువ్వు నేర్చుకుంటే నీలోకి "స్త్రీ శక్తి " వస్తుంది అని షిన్ చాన్ మరియూ ఆతని మిత్రులూ ఒక్కొక్కరు ఒక్కో గుణాన్ని ప్రతిపాదిస్తారు .
నేను స్త్రీని, నాలో స్త్రీ శక్తి వుండాలని మనవారు ఎందరు కోరుకుంటున్నారో మనకు తెలీదు .
స్త్రీ శక్తి ఎంతో విలువైనది .అమ్మ వారి రూపము .
అందువల్ల దేముడు ఏ కొద్దీ మందికో దానిని ఇస్తాడు .స్త్రీ శక్తి పొందాలి అనుకున్న మిగతా వారు దానిని సాధన చేయాలి . ఇక వారికి వారి కుటుంబములో తిరుగు ఉండదు .భోగ భాగ్యాలకు లోటుండదు --000-- ఇక్కడకి స్త్రీ శక్తి మీద నేను చెబుదామనుకున్నది ఇక్కడితో ముగిసింది -

పైన చెప్పిన సుమో గారు పందెములో గెలిచి ఎంతో కీర్తి డబ్బు పొందాడు . ఈయన తన ప్రత్యర్థి మీద " ది ఫిషెర్స్ మాన్ త్రో " అనే టెక్నిక్ ప్రయోగించి విజయం కైవసం

చేసుకున్నాడని చెప్పారు . ఇది అయన ఆయన తండ్రి నుండి నేర్చుకున్నాడు . పిల్లలకు నేర్పదగ్గ విషయ పటుత్వము . తెలివి కలిగి ఉండటమే పురుష శక్తి .ఇప్పుడు చూస్తే ఈ విజయము లేదా ఏ విజయము అయినా ఒక స్త్రీ శక్తి మరియూ ఒక పురుష  శక్తి యొక్క కలయిక.

"ది ఫిషెర్స్ మాన్ త్రో" పై వివరణ .  పారుతున్న నది మీద పడవ నిలిపి ఉంచటమే కష్టం .అలానిలిపి ఉంచిన పడవలోనుంచున్న చేపలు పట్టే వాడు నిబ్బరంగా స్థిరంగా నిలబడేది కూడా కష్టమే . నిబ్బరంగా నిలబడలేని వాడు , తన బలాన్ని అంతా చేతులలోకి తెచ్చుకొని , తన వల ఎక్కడికి పోయి పడాలి అనుకుంటున్నాడో అక్కడి కి పోయి పడేలా విసరాలి . వల విసురు ధాటికి పడవ ఎటు పడితే అటు కదులుతుంది . దాన్ని ఆపటం ఎట్లా ? రెండు కాళ్ళు పంగ చాపి
పడవకు తన్ని పెట్టటం తప్ప వేరే మార్గము లేదు .ఈ చేపల వాడు వల విసిరే విధానం నుంచి కూడా నేర్చుకోవాల్సింది ఎంతో వుంది . జపనీయులు ప్రతి దాని

నుండీ నేర్చుకోవాలి అనే సిద్ధాన్తానికి  కట్టు బడి వుంటారు
.
ముగింపు ఏమిటంటే . గెలిచిన సుమో గారు పడవలో నుంచున్న చేపల పట్టే వాడి మాదిరి అస్థిరం గా ఉంటూ కూడా -- తన ప్రత్యర్థి అయినా సుమోని చేపల వల విసిరి నట్లు బయటికి విసిరాడు . విజయం సాధించాడు . కీర్తి, కనకాల ను పొందాడు .

మామూలు వారి నుండి కూడా చూచి నేర్చుకోవటానికి, తెలివి పెంచుకోవటానికి ఎన్నో అవకాశాలు వున్నాయి అని గ్రహిద్దాము  .

ఈ వ్యాసము వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి స్వంత రచన .

—-----------------------------------------------------

## 5-తోట రాముడు .> రాతి రాముడు  24-02-24

ఒక అర్ధరాత్రి వేళ తోట రాముడు,  రాణీ గారి మందిరం లోకి ప్రవేశించాడు .    అతడి పని రాణిగారిని హత్య చేయటం.

తోట రాముడికి వత్తాసుగా ఉన్న మంత్రిగారు ఈపాటికే రాణిగారి గదిలోకి మత్తు నిచ్చే గాలిని పంపించి రాణి గారిని స్పృహలోకి రాకుండా చేసాడు .   రాణి గారి పక్క మంచం లో యువరాణి కూడా నిద్రిస్తూ వుంది    రాణిగారి గురించి యువరాణి వారి గురించి తోటరాముడికి తెలిసిన సంగతులు కొన్ని మనమూ తెలుసుకుందాము .

రాణీ గారిని పెండ్లి చేసుకున్న రాజు గారు , వన విహారం చేస్తూ - వర్షంలో తడిసి అటూ ఇటూ తిరుగుతున్న రాణీ గారిని చూసి ఆమె వనకన్య అని భ్రమసి ఆమెను పెండ్లి చేసుకున్నాడు   . నిజానికి ఆమె వనకన్య కాదు .   ఒక పిశాచి .  ఆమె రాణీ అయిన పిదప రోజుకు ఇంత చొప్పున రాజుగారి రక్తం పీల్చి తాగుతూ ఆయనను చంపి వేసి తాను రాజ్యం చేయసాగింది .   ఆమె పాలనలో ప్రజలు ఎన్నో ఇక్కట్లు పడుతున్నారు . ఆమె పిశాచము అని మంత్రి గారికి ఒక్కరికే తెలుసు . అందువల్ల రాణిని చంపి రాజ్యాన్ని కాపాడాలని మంత్రిగారు తోటరాముడిని ఒప్పించారు .

ఇహ యువరాణి విషయానికి వస్తే - ఆమె రాణిగారికి పుట్టినదే కానీ రాణీ గారి పిల్ల కాదు . తన పిశాచ లక్షణాలు కొన్ని పిల్లకు వచ్చేట్లు చేయాలని ఆలోచించిన రాణిగారు -

వేరేవారి గర్భం లో పెరుగుతున్న పిండాన్ని తీసుకొచ్చుకొని తన గర్భంలో పెట్టుకొని దానిని ప్రసవించి -అలా పుట్టిన పిల్లను తన కూతురు అని చెప్పుకుంటున్నది . ఈ యువరాణీ తల్లి లక్షణాలు ఏమీ రాలేదు . ఎంతో మంచిది . బుద్ధి వంతురాలు .అందగత్తె .

తోట రాముడు ఈ యువరాణిని వన్ వే లో ప్రేమించాడు - ఆమెను పెళ్లి చేసుకోవాలి అనుకుంటున్నాడు .అందుకని ఒక మంగళ సూత్రం కూడా వెంట తెచ్చుకున్నాడు .తాళి పడ్డాక , రాకుమారి నన్ను ప్రెమించక ఏమిచేస్తుందిలే అని తోటరాముడి ధీమా . ఈ సంగతి ఎవరికీ తెలీదు . అది సీక్రెట్ .

తోట రాముడు రాణి వంకా యువ రాణి వంకా మార్చి మార్చి చూసి ఇట్లా అనుకున్నాడు " తల్లిని చంపి పిల్లను పెళ్లాడనా ? పిల్లను పెళ్ళాడి అత్తను చంపనా ? ఏమి చేతును ???"

అట్లా ఆలోచించటానికి గానూ తోట రామునికి ఉన్న కారణాలు తోట రామునికి వున్నవి . ముందుగా రాణి గారిని చంపితే - రాణీ గారిని చంపాడన్న పెద్ద నేరం తన మీద వేస్తారు . అదే ఆమె తనకు అత్తగారు అయినాక చంపితే ,అత్తా అల్లుళ్ళ మధ్య ఎదో గొడవవచ్చి = అల్లుడు అత్తను ఎదో

చంపాడు లే అనుకుంటారు .ఇది ఒక నేరం అని చాలా మంది అనుకోక పోవచ్చు కూడా . ఇహ పిల్లని పెళ్ళాడి అత్తను చంపితే, "మా అమ్మను చంపటానికై , నన్ను పెళ్లాడిన వాడితో నేనెట్లా కాపురం చేస్తాను" అని యువరాణి తనతో కాపురానికి తిరస్కరించవచ్చు .అప్పుడెట్లా ?"

ఇట్లా ఆలోచిస్తూ తోటరాముడు రాణిగారి వంకా తన చేతిలో ని కత్తి వంకా , యువరాణి వంకా - తన బొడ్లో వేలాడుతున్న తాళి బొట్టు వంకా చూస్తూ సందిగ్ధం లో పడి పోయాడు .

తోటరామునికి తెలియని విషయము ఒకటుంది. పిశాచి రాణి గారిని చంపాలని వచ్చి ఆమెను చంపటానికి తటపటాయించే వారు గంటకు ఒక అడుగు చొప్పున రాతి బొమ్మగా మారి పోతారు అని ఒక శాపము వుంది . ఆటా ఇటా అనుకుంటూ తట పటాయింపులు పడుతూ ఉన్న తోటరాముడు ఇప్పుడు మోకాళ్ళ దాకా రాయిగా మారి పోయినాడు . కానీ అది అతనికి తెలుస్త లేదు . మీ అందరూ కూడా తెలుసు కోవాల్సిన విషయము ఏమిటంటే మీలో ఎవరైనా సరే, అతడు ఏమి చేస్తే మంచిదో సలహా ఇచ్చి అతనిని కర్తవ్యోన్ముఖుడిని చేస్తే . అతడు రాతి బొమ్మ కావటం ఆగి పోతుంది . తిరిగి మామూలు కూడా అవుతాడు .

ఇప్పుడు మీరు తోటరామునికి ఏమి చెపుతారు ? తల్లిని చంపి పిల్లని
పెళ్ళాడమనా ? పిల్లని పెళ్ళాడి అత్తను చంపమనా ? కమాన్ క్విక్ మనకుఎక్కువ సమయం లేదండి .
—-------------------------------------------------------------------------
---

తప్పి పోయిన పెద్ద మనిషి .      21-3-24

కనపడుటలేదు - అంటూ బస్సు స్టాండింగులో రైల్వే స్టేషన్ లో ఫోటోలు కనిపిస్తాయి  .  టీవీ మరియూ రేడియోలలో తప్పిపోయిన వారిగురించి ప్రత్యేకంగా చెపుతారు . కనపడటం లేదు  అన్నా  తప్పి పోయినాడు అన్నా  అది  సాధారణంగాపెద్ద వయసు పెద్దాయన గురించి - లేదా చిన్న వయసు చిన్నోడి గురించి అవుతుంది .

చిన్న పిల్లలు. రైల్వే స్టేషన్ . లేదా బస్సు స్టాండ్.  లేదా జాతరలు వంటి వాటిలో చిక్కుకు పోయి ఇంటికి దారి కనుక్కోలేక మిస్ అయి పోతూ వుంటారు ,  పెద్దలు కూడా అంతే  ,  ఇంటికి దారి కనుక్కోలేక  మిస్ అయి పోతూ వుంటారు .

పెద్దవారు  ఇంటికి దారికనుక్కో లేక పోవటానికి కారణము - ఏమిటంటే  వీరికి Dementia -డిమెన్షియా అనే లక్షణం

ఉంటుంది . డిమెన్షియా ఒక రోగం కాదు కానీ -  ఇది మెదడులో సంభవించే ఒక స్థితి .  డిమెన్షియా వున్నా వారు - ఎదుటి మనిషి గుర్తు తెచ్చుకోవటం ,చక్కగా సూటిగా ఆలోచించటం, నిర్ణయాలు తీసుకోవటం,  దారులు గుర్తు పెట్టుకోవటం- దారులు గుర్తించటం  లో విఫలం అవుతూ వుంటారు.

మీరు యువకులు . ఏదన్న ట్రాఫిక్ జామ్ లో చిక్కుకు పోతే ఏమి చేస్తారు ? పక్క సందులోకి బండి మళ్లించి త్వరగా ఇంటికి చేరుకోవాలని చూస్తారు . అంటే ఇంటికి ఇంకో ప్రత్యామ్నాయపు దారి వెతుక్కుంటున్నారు అని అర్ధము . ఇలాంటి యువకుడిని - నువ్వు ఏమీ తిప్పలు పడకుండా  నేరుగా ఇంటికి చేరుకున్నా వా ? అని ప్రశ్నిస్తే -- " లేదు సందులు గొందులు  తిరిగి చివరికి నాకు  అలవాటైన చోటుని గుర్తు పట్టి అక్కడనుండి ఇంటికి చేరానని  చెప్పుకొస్తాడు  . పెద్దలు కూడా అంతే - ఇంటినుండి బయలు దేరినాకనో  - ఇంటికి వస్తూ ఉండగానో - దారిలో ఎదో ఒక ఆటంకం ఎదురవగానే  -- ఇటునుండి కూడా మన ఇంటికి దారి వుంది అనుకుంటూ  తమకు తెలియని సందులోకి మళ్ళు - తారు. ఆపై డిమెన్షియా మూలకంగా దారులు దిక్కులు పోల్చుకోలేక  - ఇదే మన ఇంటికి దెగ్గర దారి అని భావించుతూ ఎదో ఒక  సందులోకి ఆపై ఇంకా ఎదో గొందిలోకి వెళ్లి క్రమంగా తప్పి పోతారు .  ఇంటికి దారులు కనుక్కోవటంలో యువకులే

తిప్పలు పడుతున్నప్పుడు - పెద్దలు ఎన్ని తిప్పలు పడి , చివరికి తప్పి పోయారో ఊహకు అందని విషయము .

కొత్త ప్రదేశాలలో కి వెళ్లి ఇరుక్కొని , ఇంటికి వెళ్లే దారులను గుర్తు తెచ్చుకోవటంలో విఫలమయ్యే పెద్దలు ,కూడా అంతే . ఇలా వెడితే మన ఇల్లు తొందరగా వస్తుంది - అని నమ్ముతూ - అలా ఎదో ఒక దారిని ఎంచుకుంటూ , పద్మవ్యూహం లో దూరిన వారి మాదిరి, ముందు ముందుకూ సాగి పోతూ దారి తప్పి పోతారు . ఈ సమయంలో వీరి మీద డిమెన్షియా లక్షణాలు అయిన - చక్కగా, సూటిగా ఆలోచించలేక పోవటము , నిర్ణయాలు తీసుకోలేక పోవటం , వచ్చిన దారిని గుర్తు పెట్టుకోలేకపోవటం - వంటివి అమిత ప్రభావము చూపిస్తాయి.

డిమెన్షియా ఎందుకు వస్తుందో తెలిస్తే, పెద్దలు ఎందుకు తప్పిపోతారో తెలుస్తుంది . ఎటు వంటి వ్యాయామము లేనపుడు శరీరం ఎట్లా బలహీన పడుతుందో -అలాగే తమను మాట్లాడించే వారు ఎవరూ లేనపుడు - పెద్దల మెదడు బలహీన పడుతుంది . మాట్లాడించే వారు ఎవరూ లేనపుడు -పెద్దలలో ఏదన్నా తెలుసు కోవాలి అన్న ఆసక్తి తగ్గిపోతుంది.- తెలుసుకోవాలన్న ఆసక్తి తగ్గగానే మెదడు బలహీన పడి అదే క్రమంగా డిమెన్షియా గా మారుతుంది. పెద్ద వయసు వచ్చిన వారు ఎక్కువగా తమ సొంత వూరు , బాల్యం గడిపిన వూరు గుర్తు చేసుకుంటూ

వుంటారు .ఈ రకంగా వారి మెదడు తిరిగి చైతన్య వంతం అయ్యేందుకు ప్రయత్నిస్తూ ఉంటుంది .   ఇంట్లోని వ్యక్తులు , తమతో మాట్లాడుతూ కాలం గడపనపుడు వీరు తాము తమ బాల్యములో తిరిగిన ప్రదేశాలకు వెళ్లి పోవాలని కోరుకుంటూ వుంటారు . మొదటిలో ఎదో అలవాటు చొప్పున తమ మనసులో మెదిలిన ఊళ్లకు వెళ్లి వస్తూ వుంటారు . దీనితో ఇంటిలోని వారు " ఆయన అట్లాగే వెళతాడు అట్లాగే వస్తాడు అని అనుకుంటారు . కానీ ఆయనకు డెమెన్షియా మొదలైందని - ఆయనతో మాటా మంతీ జరుపుతూ తమలో కలుపుకొని . అయన తమనుండి తప్పి పోకుండా చూసుకోవాల్సిన సమయము వచ్చింది అని గ్రహించరు .

మొత్తము మీద పెద్దలు తప్పి పోవటానికి వారికి ఉన్న డిమెన్షియా ఏ కారణం అనుకుంటే- పెద్దవారితో మాట్లాడకుండా వారిని గాలికి వదిలేసి వారికి డిమెన్షియా తెప్పించిన -- వారి కుటుంబ సభ్యులదే- ఇందుకు నూరు పెర్సెంట్ భాద్యత . పెద్ద వయసు వున్నవారు డిమెన్షియా తో తప్పిపోవటమే ఎక్కువ -కుటుంబ సభ్యులు "అయన అలిగి వెళ్లి పోయారు " అంటూ వుంటారు . ఈ మాట కుటుంబ సభ్యులు తమ వంతు లోపాన్ని కప్పి పుచ్చుకునేందుకు వాడే మాట అని గ్రహించాలి. పెద్దలు అలిగి వెళ్ళటం అనేది తరచూ జరగదు . ఎందుకంటే వారే

ఏర్పరుచుకున్న   కుటుంబము అనే కంఫర్టు ను కాదని వారే వెళ్లి పోరుకదా ? ఆలా వెళ్లారు అంటే అందుకు  కూడా కుటుంబ సభ్యులదే భాద్యత .            - భారత దేశముతో సహా - ప్రపంచము అంతటా  వృద్ధుల జనాభా పెరిగి పోతున్నది . అందువల్ల  తప్పి పోయే పెద్దల సంఖ్య కూడా పెరుగుతూ వున్నది.   వృద్ధ శరణాలయాల్లో ఉండేవారు పేదలే అన్న భావంలో ఉంటాము . కానీ వీరిలో తప్పి పోయిన పెద్దలు కూడా ఎంతో మంది ఉంటాబు.   వారు పిచ్చివారని మనము అనుకుంటాము .  ఇప్పుడు ఎట్లా వున్నాగానీ మన సామజిక వ్యవస్థ ఇలాగే కొనసాగితే,   ఇంకేముందు రోజుల్లో తప్పి పోయిన పెద్దమనిషి ఇంటికి ఒకరు వుంటారు .          తప్పిపోయిన వారిని వెతికి పట్టుకోని తిరిగి భద్రమైన జీవితంలోకి ప్రవేశపెట్టడం ప్రతి వ్యక్తి యొక్క  సామాజిక భాద్యత అని చాలా దేశాలు గుర్తించాయి . మనము తప్ప .      ఒక సామాజిక భాద్యత లో భాగంగా మనం ఎన్నో ఎన్నో వాట్సాప్ గ్రూప్ లు పెడుతూ ఉంటాము. చేరుతూ ఉంటాము  .  కానీ  తప్పిపోయిన వారికోసం మన దేశంలో ఎవరైనా, ఏదన్నా వాట్సాప్ గ్రూప్ పెట్టారా అని నాకు సందేహం వున్నది .    లేదు -- అంటేపెద్దల పట్ల  మనకు ఇంకా సామాజిక స్పృహ కలుగలేదుఅనుకోవాలి. తప్పి  పోయినపెద్దల కోసమని, జపాన్లో  అనేక  వాట్సాప్

గ్రూపూలు వున్నవి . పెద్దలు తప్పి పోవటంతో ఈ సమాజానిదే భాద్యత అనుకున్న వారు ఈ గ్రూప్ లలో చేరుతారు . మా తల్లీ లేదా తండ్రి తప్పి పోయారు అంటూ ఎవరన్నాగానీ ఆ వాట్సాప్ లో మెసేజ్ పెట్టగానే . సమాజము పట్ల ఒక భాద్యత ఫీల్ అయ్యే వారు ఈ వాట్సాప్ మెసేజ్ ఆధారంగా , ఫోటోల ఆధారంగా పెద్దల గురించి వెతుకుతారు . కనపడితే వారిని ఆదరించి వైద్యము ఆహారము ఇచ్చి ఇంటి కి తెచ్చి దిగపెడతారు .

పిల్లలుకూడా సమాజంలో భాగమే కదా ? మరియూ రేపటి పౌరులు కూడా కదా ? అందుకని తప్పి పోయిన పెద్దలను వెతకాలి అది మన భాద్యత అన్న ఆలోచన పిల్లలలో కలుగ చేయవద్దా ? పై ప్రశ్నకు జవాబు గా -- ని జపాను దేశంలో - ఏదన్న ఒక ప్రాంతం లేదా వూరిలో ఒక పెద్ద మనిషి తప్పి పోతే - ఆ ప్రాంతములో లేదా వూరిలో ఉన్న బడి పిల్లలకు ఆ రోజు సెలవు ఇచ్చి , మీరు పోయి మీకు ఇష్టం వచ్చిన చోట వెతికి ఆ తప్పి పోయిన పెద్ద మనిషి కనపడతాడో ఏమో చూడండి అని పురమాయిస్తాబు . ఏదన్న వూరిలో తప్పి పోయిన పెద్ద మనిషి తమావూరిలో తిరుగుతున్నాడు అన్న సమాచారం వూన్నపుడుకూడా ఇలాగె సెలవు ఇస్తారు . పిల్లలకు హుషారు - నీతి నిజాయితీ, పట్టు దల ఎక్కువగదా ? వారు ఊరంతా గాలించి తప్పిపోయిన వారిని గుర్తించిన సంఘటనలు

కూడా అనేకం కనపడతాయి . ఇలాంటి పిల్లలకు స్కూల్ వారుప్రోత్సాహకాలను కూడా అందిస్తారు . అనగా - సమాజం పట్ల భాధ్యతలను ఫిల్ అయ్యే నవ తారాన్ని తయారు చేస్తూ వుంటారు . నేటి పిల్లలే రేపటి పెద్దలు - ఆ పెద్దలే ఇకముందు ముందు రోజుల్లో డెమెన్షియా పేషెంట్ గా గూడా అవవచ్చు .అందువల్ల ఇలాంటి ఒరవడి ఒకటి ఉండాల్సిందే .

జపాను వారి సామాజిక ద్రుష్టి మనము అందరమూ గమనింప దగినది అని అలోచించి ఈ వ్యాసము రాసాను . నాకు తెలిసి - ఆస్థి చిక్కులు ఏర్పడి - ఆ చిక్కులు విడదీసే పెద్ద వారి సంతకాలు కావాల్సి వచ్చినపుడే - మన వారు తప్పిపోయిన పెద్దల కోసం సీరియస్ గా వెతుకుతారు. అంతే .

నిజాల మీద ఆధార పడి ఈకధనం వ్రాసినది వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి

——————————————————————

## 6-నేడు ఆది ఆంధ్రుల అష్టమీ దినోత్సవం 20-03-24

పండగలు అంటే పడి చచ్చే ఆంధ్రులకు నేడు ఏమి పండుగ నో మీకు తెలుసునా ? నేడు ఆది ఆంధ్రుల అష్టమీ దినోత్సవం .

ఆంధ్ర భాష మొలకెత్తినాక దాన్ని మాట్లాడే వారి సంఖ్య ఎనిమిది కి చేరిన రోజు .ఈ రోజు .  ఎనిమిది మంది ఆంధ్రులు ఒక చోట సమావేశమై ఇక్కడ బ్రతుకుడు కష్టంగా వుంది అష్ట దిక్కులకూ వెళ్లి పోదాం అని నిర్ణయం తీసుకున్న రోజు ఈ రోజు .. ఆంధ్రులు ఒకటి రెండో మూడో .. అంటూ ఎనిమిది దాకా అంకెలను రూపొందించుకున్నది కూడా నేడే.  రెండు చేతులకూ ఉన్న అన్ని ఫింగర్స్ లోనూ బొటన వేలు మినహాగా మిగతావి అన్నీ కూడా చాలా ముఖ్యమైనవి అని తీర్మానించి వాటికి ఉంగరాలు బహుకరించిన రోజు .ఈ రోజు . సిగ్గులు ఎనిమిది రకాలు అని కనిపెట్టిన రోజు కూడా నేడే . వంటచెరుకుగా పనికొచ్చే తుమ్మ చెట్టు కన్నా , పులిహోర చేయటానికి, నిమ్మ చేట్టే అవసరం అని కనిపెట్టిన రోజు కూడా ఈ రోజే . .

ఫన్ కోసం వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి

—-------------------------------------------------------

## 7– లాంగ్ లాంగ్ డాక్టర్ గారు    19-03-24

ఏదైనా బస్సెక్కి మావూరు అమరావతి నుండి బయలు దేరి మూడు గంటలు దాటి ప్రయాణం చేస్తే అది మాకు లాంగ్ జర్నీ . అమరావతి నుండి విజయవాడకు రెండు గంటలు .

విజయవాడనుండి హైదరాబాద్ కి ఐదు గంటలు. మొత్తము ఏడు గంటలు . ఇదిమాకు లాంగ్ జర్నీ . వేసవి సెలవలకని మా అమరావతికి వచ్చిన మా మనుమలు మనుమరాళ్లను తీసుకొని , వాళ్ళని వాళ్ళఇంట్లో విడిచి వద్దామని లాంగ్ జర్నీ చేస్తూ వున్నాను . పిల్లలు ఫోన్లకు ఫుల్ ఛార్జింగ్ ఇచ్చి . డేటా బాలన్స్ లు వేయించి పెట్టుకున్నారు . బస్సుల్లో నిరాఘాటంగా వీడియోలు చూడొచ్చు అన్న ఆశతో . మా బస్సు వూరు దాటగానే - పొలిమేర పోలేరమ్మ గుడి దగ్గర ఒక సెక్యూరిటీ గార్డ్ - ఇన్ ఫుల్ యూనిఫామ్ అండ్ విత్ ఏ గన్ను తో మా బస్సు ఎక్కాడు . మాది రాత్రి ప్రయాణం కదా ? ఈ రాత్రి తిరిగే బస్సులకు ఏదన్న త్రీవ్రవాద ముప్పు ఉన్నదేమో, అందుకే ఈ ఏర్పాటు ఏమో ? అని సమాధాన పడ్డాను. ఆ చీకటిలో ఆయన బుర్రమీసాలు , అయన ఎత్తూ లావూ చూసి నాకే భయమేసింది ."ఇట్లాంటి వారిని పాకిస్తాను బోర్డర్లో నిలబెట్టి - వాళ్ళ చేత ఉచ్చ పోయించా వచ్చు" అని ఆలోచిస్తూ మురిసి పోయాను . అయన ప్రతి సీటుకు తిరుగుతూ " మీ ఫోన్లు ఇలా ఇచ్చేయండి - చెక్ చేయాలి - అవీ ఆర్డర్స్ " అని మా అందరి దెగ్గర ఫోన్లు తీసుకున్నాడు . మా మనుమలు- అలాంటి ఇతర చిన్నపిల్లలు, ఇంకా ఇతర పెద్దపిల్లలు - ఇంకా చాలా మంది పెద్దలు అప్పటికే ఫోన్లలో కూరుకు పోయి వున్నారు . వాళ్ళు

కూడా వాళ్ళ ఫోన్లు ఇచ్చారు . జెనెరల్గా ఎవరూ కూడా వాళ్ళు ఫోన్లు వదలరు కదా ? పోలీసు భయం అనగా ఒక యూనిఫామ్ పట్ల వుండే భయం వాళ్ళని ఫోన్లు వదిలేట్లు చేసింది . మాది రాత్రి ప్రయాణం కనుక చేతిలో ఫోన్లు లేకపోయే సరికి ప్రతి ఒక్కరూ నిద్రలోకి జారారు .అదే ఫోన్లు వుండి వుంటే వాటిల్లో వీడియోలు చూస్తూచాలామంది తెల్లార్లు జాగారం చేస్తారు అనటంలో ఏమీ సందేహం లేదు . హైద్రాబాదులో బస్సు దిగాము . మా ఫోన్లు మాకు ఇచ్చాడు ఆ సెక్యూరిటీ ఆయన. .పగటి వెల్తూరులో నేను అతన్ని గుర్తు పట్టాను .అతడు మిలటరీ నుండి రిటైర్ అయి వచ్చిన మాణిక్యాల రావు . " ఏమిటండీ విషయాలు - అని అడిగి , నేను భలనా - నేను మీరు బాల్య మిత్రులం అన్నాను . అతడు హేపీ గా నవ్వి " ఇది మనవూరి డాక్టర్ ఈశ్వర్ గారు ఇచ్చిన , నాకు నచ్చిన జాబ్ అండీ . నాలాగే ఇంకా ఇద్దరు ముగ్గురు వున్నారు . మనవూరినుండి లాంగ్ జర్నీ వెళ్లే బస్సులో ఎక్కి - ప్రయాణీకుల వద్ద ముఖ్యంగా పిల్లల వద్ద ఫోన్లు తీసుకొని - మా దెగ్గర పెట్టుకుంటాము . పిల్లలు, పెద్దలు అని తేడా లేకుండా ప్రతి ఒక్కరు కూడా జర్నీలో కూడా ఫోన్లు చూస్తూ పాక్షిక అంధత్వాలు తెచ్చుకుంటున్నారని- అలోచించి - మా డాక్టర్ గారు ఈ జాబు క్రియేట్ చేశారు . ఆయనది ఎదో ఉడతా భక్తి సేవ అనుకున్నా - పిల్లలు పెద్దలు

ఫోన్లు చూడటం మానేసి చక్కగా నిద్రపోవటం చూసి నాకు ఎంతో సంతోషం అవుతుంది . నా మనుమడు ఫోన్లు చూసి చూసి, తొమ్మిదేళ్ల వయస్సుకే పాక్షిక అంధత్వం తెచ్చుకున్నాడు . అందువల్ల నాకు నా డ్యూటీ మీద డెడికేషన్ ఎక్కువ. జర్నీలో ఎవరి ఫోను అన్నా మోగితే ఆ ఫోను తీసుకెళ్లి వాళ్ళకిచ్చి తిరిగి తీసుకోవటం కూడా నా డ్యూటీ నే . రాత్రి మీ ఫోను మోగలేదు . " అన్నాడు .  " సరే మేము వెడుతున్నాము - ఇప్పుడు మీరేమి చేస్తారు ? " అని ఆయనను అడిగాను . " ఇష్టమైన పనే చేస్తాను.  ఈ రాత్రికి మన వూరు వెళ్లే బస్సులో ఎక్కి మళ్ళీ ఫోన్లు లాక్కుంటాను. ఆ రకంగా కొందరికళ్లకు బలవంతంగానైనా సరే  విశ్రాంతి ఇప్పిస్తాను   "  "మరి మన ఊరి ఈశ్వర్ డాక్టర్ గారు కళ్ల డాక్టర్ కాదు గదా ? ఆయనకేమి లాభము " " ఆయనకు ఖర్చే  గానీ లాభము ఏమీ ఉండదు . కేవలం దూరదృష్టితో - పిల్లలు పెద్దలు అందరూ చక్కని కంటి ఆరోగ్యం కలిగి వుండాలనే  ఆయన మాచేత ఈ పని చేయిస్తాడు "    " ఒక్క సారితో,  ఒక్క రోజుతో పని అవుతుందా ?" " ఇవాళ మన డాక్టర్ గారు మొదలెట్టారు . రేపు ఇంకొకరెవరో ఆయన్ను ఫాలో అవుతారేమో . ఒక ప్రయత్నం అయితే  మొదలెట్టాము కదా ?" " ఆయన లాంగ్ దృష్టికి నా నమస్సులు , ఆయన చాలా లాంగ్ బ్రతకాలని మేము కోరుకున్నామని  చెప్పు "  డాక్టర్ గారికి నేను

ఇచ్చిన రెండు లాంగ్ ల లో ఒకటి అయన కున్న మానవతా దూరదృష్టికి ఇచ్చాను . ఇంకో లాంగ్ అయన ఇంకా ఇంకా ఎంతో కాలం పాటు జీవించి ఎందరికో స్ఫూర్తి కలిగించాలని కోరి ఇచ్చాను . వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి స్వంత రచన

——------------------------------------------------

----

**8– సంసారం 17-03-24**

నేను నాభార్య వెళ్లి ఒక ఇల్లు అద్దెకు తీసుకొని - అందులోనికి గృహ ప్రవేశం చేసాము . ఆమె వెళ్లి ఇరుగు పొరుగు ఆడవాళ్ళకి - ఫైవ్ స్టార్ చాకోలెట్ ఇచ్చి - నవ్వి వచ్చింది .

రెండో రోజు ఉదయం - ఒక పెద్దావిడ - మా ఇంటికి కి వచ్చింది మాతో పరిచయం కోసం మరియు కాలక్షేపం కోసం అనుకుంటాను .. మేము వీపులు గోడలకి ఆనించి - చతికల పడి కూచొని విశ్రాంతి తీసుకొంటూ వున్నాము . రాండి .. పెద్దమ్మా - రండి

కూచోండి -అని ఆమెను ఆహ్వానం చేసి - మాపక్కనే చతికిల పడమన్నాము. సామాను రాలేదా ? ముందుగా కుర్చీలు తెచ్చుకోవాల్సింది " అని ఆమె కూడా మాతో పాటు కూచుంది

" మాకు సామాను ఉండదు - వున్నా సామాను తెచ్చేసాము. మేమిద్దరమూ - యిల్లాగే కూచుంటాము . సంసారం సింపుల్ చేసుకున్నాము- అని చెప్పాను .

" సామాను లేకపోతే కాఫీ టీలు యెట్లా ?

" ఇద్దరమూ ఉద్యోగాలు చేస్తాము - వెళుతూ టీ - టిఫిన్లు కానించేసి వెడతాము . మాకు పాలు టీ పొడి చెక్కర డబ్బాలు వుండవు "

" బట్టలు వేసుకోవటానికి - తాడు కూడా కట్టలేదు " అన్నది ఆమె

" మాకు బట్టలు ఉతుక్కునే పని ఉండదు . ఆమెకూ నాకూ వేరు వేరు మెడికల్ లాబ్ లో పని . వెళ్ళగానే

మా ఒంటి మీద బట్టలు విప్పి కంపెనీ వాళ్లకి ఇచ్చి - వాళ్ళిచ్చిన - శానిటైజ్ చేసిన డ్రెస్సులు వేసుకుంటాము. కంపెనీ వాళ్ళు - మేము విప్పి ఇచ్చిన మాడ్రెస్సులు ఉతికి - శానిటైజు చేసి అక్కడపెట్టేస్తారు .అవి అక్కడనే ఉంటవి . మరునాడు వెళ్లి వేసుకుంటాము . అందువల్ల మాకు బట్టల తాడూ , బట్టల కోసం అలమరాలు - కలరా ఉండలు - సబ్బు బిళ్ళలు వుండవు . అని నేను చెప్పాను .

" టీవీ తేలేదా ? అని ఆ పెద్దామె అడిగింది .

" ఎవరి ఫోన్లు వాళ్ళకున్నాయి . అవ్వే మాటీవీలు . మాకు డిష్ లక్కరలేదు . కేబుల్ అక్కరలేదు "

" మంచి నీళ్ల బిందె కూడా లేదు "

" వారానికి సరిపడా వాటర్ ప్యాకెట్లు - కొని గూట్లో పెట్టుకుంటాము . మాకు బిందెలు కడవలు - చెంబులు బక్కెట్లు కూడా వుండవు . మా కంపెనీ రూలు ప్రకారం లాబు నుండి బయటకు వస్తూనే -

తల దగ్గరనించీ - వళ్ళంతా శుభ్రం గా కడుక్కోవాలి . వాళ్ళే మెడికేటెడ్ సోపు షాంపూ ఇస్తారు .ఇహ  అదే మా స్నానం.  అక్కడే మాటాయిలెట్ - అట్లాగే అలవాటు చేసుకున్నాము.మరీ ఏదన్న ఎమర్జెన్సీ వస్తే పనికొస్తాయి లెమ్మని  - నాలుగు ఎడల్ట్ డైపర్లు వుంచుకుంటాము"

" ఒక్క గిన్నె కానీ - గ్లాస్ గాని - స్టవ్ గానీ కనపడదేంటి ?"

"  ఇద్దరమూ క్యాంటీన్లలో తింటాము . అక్కడ నచ్చక పోతే స్విగీ లో ఆర్డర్ ఇచ్చుకుంటాము.  రాత్రిళ్ళు ఇంటికి వస్తూ బండి దగ్గర చపాతీలు తిని లస్సీ తాగుతాము . "మాకు గిన్నెలు - కుక్కర్లు - పాలగిన్నెలు - అంట్ల సబ్బులు వుండవు "

" బండి తెచ్చుకున్నారా ?

" లేదు - అరకిలో మీటర్ మార్నింగ్ వాక్ చేస్తే  - అక్కడికి కంపెనీ బస్సు  వస్తుంది .అట్లాగా జాబుకి

వెళ్లి వస్తాము . ఇంకా ఎక్కడికన్నా వెళ్లాలంటే ఎవరన్నా లిఫ్ట్ ఇస్తే ఎక్కి పోతాము - వస్తాము. కాదంటే షేర్ ఆటో ఎక్కుతాము. లేదంటే నడుస్తాము . మాకు బండ్లు - దానికి మెకానికు - అందులోకి పెట్రోల్ - టైర్లలోకి గాలీ అవసరం ఉండదు .

" అసలు మీకున్న సామాను ఏమిటి ?

" మూడు పెద్ద ట్రాలీ బ్యాగ్లు .. ఒక దాంట్లో మెత్తటి బొంతలు - ఎయిర్ పిల్లొలు - పక్క దుప్పట్లు - కప్పుడు దుప్పట్లు - టవల్స్ పెట్టుకుంటాము . సాధ్యమైనంత వరకూ నేలమీద న్యూస్ పేపర్ పరుచుకొని - తలకింద పుస్తకం పెట్టుకొని పడుకుంటాము . మాకు మాసిన గలీబులు - దుమ్ము పట్టిన దుప్పట్లు వుండవు . జిడ్డు పట్టిన దిండ్లు గూడా వుండవు .అందుకని ఏదీ ఉతుక్కోవటం అనేది కూడా ఉండదు "

" మిగతా రొండింటిలో - ఏముంటాయి ?

"నీలం రంగు దాంట్లో ఆమె బట్టలు - నల్ల రంగు దాంట్లో నా బట్టలు ఉంటాయి .ఎవరిదీ వాళ్లు సర్దుకుని రెడీ గా వుంచుకుంటాము . ఆమెకు పోవాలనిపించినపుడు - బ్యాగు లాక్కుంటూ వెళ్లి - వాళ పుట్టింటి కి బస్సు ఎక్కు తుంది .నేను అంతే . ఇద్దరం కలిసి ఏదన్న యాత్రకు వెళ్లినా అంతే . విడిగా వెళ్లినా అంతే .. మాకు ప్రయాణపు హడావుడి - బట్టలు సర్దుకోవటం వుండవు ".

" చివరికి చీపిరి కూడా లేనట్లుంది ? "

" ఒక పనమ్మాయికి పురమాయించాము .మా ఒప్పందం ప్రకారం దాని సొంత చీపురు - సొంత మాపు - ఒక బకెట్ నీళ్లు తెచ్చుకొని - ఇల్లు తుడిచి వెళ్లి పోతుంది [] మాకు డెట్టాలు - లైజాల్ , విమ్ము - రిమ్ములు వుండవు "

" ఏందో నాయనా ? అంతా కలికాలం లాగుంది . ఏమీ సామాన్లు లేని - ఏ కష్టాలు నష్టాలు లేని  మిమ్మల్ని చూసి - మీది ఓ సంసారం అనాలని పించటం లేదు . ఏమనుకోవద్దు నాయనా . పెదముండను అడుగుతున్నాను .మీరు నిజంగా పెళ్లి అయినా వాళ్లేనా ?  లేక లేచి  పోయి వచ్చిన వాండ్రా ? అని అడిగింది పెద్దామె .

మాఆవిడ వెంటనే తన ఫోను ఓపెన్ చేసి - మా పెళ్లి ఫోటోలు చూపింది .

ఆమె సంతృప్తి పడలేదు - ఏందో నాయనా ఫొటోల్లో మ్యాజిక్ ఉంటుందంటగా ? అని నోరు చప్పరించింది . మా ఆవిడా కు స్పోర్టివ్ సెన్స్ ఎక్కువ నే . వెంటనే పర్సులో వున్నా తాళి తీసి " "దీన్ని - ఈ పెద్దమ్మ ఎదురుగా ఇంకో సారి కట్టండి ...  ఏమవుతుంది ? ఆమె  మూలకంగా - మనము నిజమైన భార్య భార్య

భర్తలమని - మనదీ సంసారమే నని ఈ సమాజానికి రుజువు అవుతుంది " అన్నది.

మా కోరిక మీద మా నూతన వధూ వరులను దీవిస్తూ, ఆ పెద్దావిడ ఒక సెల్ఫీ దిగింది - అట్లాగే ఆమెను మా మధ్యన పెట్టుకొని మేమూ ఒక సెల్ఫీ దిగాము [] మీకు షేర్ చేస్తాను . చూద్దురు గాని .

ఇట్లు వారణాసి శ్రీ రామకృష్ణ అమరావతి



All reactions:300 above

—-----------------------------------------------------------

---

**9-**పెద్ద పట్టే పట్టాడు**...** **30-12-22**. మరలా రెండో సారి 14 -03-24

జోగినాధం గారు, కారు దిగి కాళ్ళు ఈడ్చుకుంటూనూ ఉసూరు మంటూ " దైవ విజ్ఞాన

జ్యోతీష మహా ఋషి పీఠం " అని రాసి వున్న భవంతి లోకి వచ్చాడు . జోగి నాదం గారికి ఒక అబ్బాయి ఒక అమ్మాయి పెళ్ళికి వున్నారు . జ్యోతీష పీఠం గురువు గారు ..ఎదో తన సొంత లాభం కోసం అని అవీ ఇవీ చెప్పి - ఆ పిల్లలు ఇద్దరిలో ఏ ఒక్కరికీ పెళ్లి అనేది జరక్కుండా జాగర్త పాడుతున్నడు. తన పబ్బం గడుపుకుంటున్నాడు .

జోగినాధం గారు దైవగణ్యులు చెప్పింది తూచా తప్పకుండా , మనస్పూర్తిగా నమ్ముతాడు . వాళ్ళు జరపమన్న పూజలు, హోమాలు కోసం ఎంత డబ్బైనా వెచ్చిస్తాడు .డబ్బు దండిగా వుంది కాబట్టి అది అయన బలహీనత అయ్యింది .

ఇక ఈ గురువు గారు మాటమాట్లాడితే చాలు - " గ్రహాలు అంత స్పష్టంగా చెపుతున్నప్పుడు - మీకు కష్టం వేసినా గానీ నేను వున్నది ఉన్నట్లు చెప్పక తప్పదు" అని ముక్తాయింపు ఇస్తుంటాడు . స్వయంగా అయన కొడుకులే పెళ్లిళ్లు కాకుండా

నిల్వవున్నారు. దాన్ని గురించి అయన చేసింది ఏమిలేదు .

కొంత మందికి కాఫీలో ఘాడత పెరిగినకొద్దీ - కాఫీ మజా ఇస్తుంది . మరికొందరికి కూరలో మసాలా ప్లస్ ఉప్పు , పడిన కొద్దీ మజాకా వస్తుంది .ఆ మజాలో చివరికి మనిషి మూలపడతాడు . జాతకాలు చూపించుకునే వారి పరిస్థితి కూడా ఇలాగే ఉంటుంది .ఆ మజాలో పడి చివరికి పిల్లలని నలభై దాటించేస్తారు . అప్పుడు పిల్లలకి ఇంకా పెళ్ళికాలేదని వాపోతారు . అప్పుడుకూడా వీరికి నవ గ్రహాలను శోధించి పిల్లల గురించి ఎదో కనుక్కోవాలని, పిల్లల గురించి ఇంకా ఎదో మరింత స్పష్టంగా వినాలని, పిల్లల భవిష్యత్తును టీవీ లో చూసినట్లు చూడాలి -అనే కోరిక ముదరగా - ఇంకా ఇంకా గ్రహ పిచ్చాలో పడతారు .

జ్యోతిష్కులు వంట మేస్త్రి వంటివారు. కొత్త మసాలాలు ప్లస్ అదనపు ఉప్పు కలిపి వండి

వడ్డించి  "మీ మాటల వంటకాలు సెహబాష్. మాకు బాగా రుచించాయి"   అని జనం చేత అని పించుకోవాలన్న కుతి  కలిగి  వుంటారు  .  తమ మాటలు రచించిన   వారినుండి నమస్కారాలు - దక్షిణలు రాబట్టి తన ప్రయోజకత్వాన్ని తన కుటుంబానికి  నిరూపించుకోవలన్న దురద ఎక్కువవుతుంది  పీఠం నాయనలకు .

జోగినాధంగారు ఉసూరు మంటూ నిరాశగా లోనికి రావటం , పీఠం నాయన కనిపెట్టాడు . ఈ పిట్ట చేజారిపోతే గుడ్డు లేదా ఫుడ్డుకు కష్టం అవుతుంది ,అవతల బెంజ్ కారు కు ఈ ఎం ఐ వుంది  అందువల్ల ఈ పిట్టఎగిరి పోకుండా ఏదన్న  కొత్త  ఆకర్షణలో పడేయాలి అనుకున్నాడు.
జోగినాధం గారు కూచోగానే పీఠం నాయన ఇట్లా అన్నాడు " మీకోసం అని వేదం జోస్యం ఖగోళం చెరక సంహిత. మకర కుండల ,  వంటి గ్రంధాలు ఎన్నో పరిశీలించాను . " గ్రహాల దేముంది ? గ్రహాలు అనుకూలించకపోతే  ఏమైపోయింది ?  . దేముళ్ళు

లేరా ? వారు మన పనులు చూడరా ? అని ఒక గ్రంథంలో రాసి పెట్టారు . ఆ సంస్కృత గ్రంథ ప్రకారం " ప్రతి వత్సరం -ఫదో నెల దశమి నాడు ఏకాదశి ఘడియలప్పుడు పార్వతీ పరమేశ్వరులు ముచ్చట్లకు కూచుంటారు . శివుడు ఆధాట్టుగా ఒకబ్బాయి పేరు చదివితే - అమ్మవారు ఒక అమ్మాయి పేరు చదువుతుంది . ఇహ అంతే - ఆ అమ్మాయికి అబ్బాయికి వివాహం అయిపోయినట్లే. ఇహ ఇక్కడ మనం కల్యాణ మండపాలు మాట్లాడి ముడి పెట్టించేయటమే .

పెళ్లి కాకుండా గ్రహాలు అడ్డుపడ్డ నిర్భాగ్యులను బ్రోచటానికి అని ఆ ఆది దంపతులు ఈ ముచ్చట్లు పెట్టుకుంటారు . "మనము అసలు పనులు మాని ఇలాంటి పనులలో పడితే లోకం ఏమవుతుందో? " అనుకుంటూ వారు ఒక్క ముప్పది నిమిషాలకు మించి ఈ ముచ్చట్లు పెట్టుకోరు . అప్పుడు శివుడి చేతుల్లో అబ్బాయిల లిస్టు - అమ్మవారి చేతుల్లో అమ్మాయిల లిస్టు ఉంటాయి . వారు ఆలిస్టును అక్షర క్రమం లో చదువుకుంటూ వచ్చి పెళ్లిళ్లు

కానివారికి పెళ్లిళ్లు అనుగ్రహిస్తూ వుంటారు .  మీ అబ్బాయి పేరేమో యాదగిరి . అమ్మాయి పేరేమో యామిని . "యా "   అనే అక్షరంతో మీ పిల్లల పేర్లు మొదలవడంతో మీ పిల్లల పేర్లు - పార్వతీ పరమేశ్వరుల వద్ద ఉన్న లిస్టులో ఎక్కడో చాలా అడుక్కు వున్నాయి  .మనం ఇట్లాగే చూస్తూ కూచుంటే పిల్లల పెళ్ళికి ఇంకా ఎంత సమయం పడుతుందో ఎవరం చెప్పలేము . అందువల్ల నేను చెప్పేది ఏమిటంటే  మీ పిల్లలకు ఇప్పుడు ఒక బారసాల చేసి  - మీ అబ్బాయి పేరు “ఈద్గిరి” అని, అమ్మాయి పేరు " ఈమని" అని మారుద్దాము .ఆపై గణపతి హోమం చేసుకుని ,  వినాయకుడిని ఆహ్వానించి - మీ పిల్లల పేర్లు మారినట్లు ఆయనకు తెలియ చేసుకుంటాము .ఎందుకంటే తన ఏకదంతన్ని వుపయోగించి లిస్టులు రాసేది ఆయనే . దీనితో   మీ పిల్లల పేర్లు లిస్టులో ముందు కి వచ్చేస్తాయి . అంటే ఆ ఆ లతో మొదలయ్యే పేర్లు అయిపోగానే పార్వతీ పరమేశ్వరులు మీ పిల్లల పేర్లే చదువు తారు . ఇక మీ పిల్లల పెళ్లి కావటం చిటికెలో

పని . పిల్లల పేర్లు లిస్టులో పైకిచేర్పిద్దాము అని మీరు .అంటే రేపే మనము "మహాగణపతి సిద్ధ ఆనంద సిద్ధి మహా యజ్ఞ హోమము" చేద్దాము. మీకు అదే మంచిది అని - అని నాకు తోస్తోంది" అన్నాడు .

"అంత గొప్ప వారు కలుగ చేసుకొని మన పిల్లల పెళ్ళికి పూనుకుంటే ఇంకా మనకి కావాల్సింది ఏమిటట ? పేర్లు ముందుకి పెట్టిద్దాము. వాళ్ళ భవిష్యత్తును తీర్చి దిద్దుదాము " అన్నాడు జోగినాధంగారు. ఆ పై ఎనిమిది లక్షలుహోమాలు కోసం ఖర్చు చేసాడు .పెళ్లప్పుడు పది మంది బంధువులను పిలిచి బువ్వలు ఎట్టుకోవాలన్న కోరికనుకూడా ఇందులోనే తీర్చుకోవచ్చునని దీన్నొక ఫామిలీ ఈవెంట్ లాగా జరిపించి ఫుల్లుగా ఖర్చు పెట్టేసాడు .

జోగినాధంగారి జోరు చూసి "అబ్బో ఈనా పెద్ద పట్టే పట్టాడు" అని బంధువులు అనుకున్నారు .

వారణాసి శ్రీ రామకృష్ణ అమరావతి స్వంత రచన .

మొదట సారిగా రాసిన దాన్ని, కాస్త సరిదిద్ది తిరిగి రాసాను .అందువల్ల ఇది మనము ఎప్పుడో చండీమామే అని మీకు అనిపించ వచ్చు .

—------------------------------------------------------------------------
---

## 10- ది అమరావతి సాయిఈశ్వ ర్ హాస్పిటల్
## 12-03-24

ఒకానొక ఉదయం నేను చద్దన్నం తిని స్కూల్ కి బయలు దేరుతూ వున్నాను .
" గిన్నెలో ఇంకా మిగిల్చావేమిరా ? తినక పోయావా ? " అని మా అమ్మ మందలింపుగా అన్నది .
"ఇపుడు నేను ఏమిచేతురా లింగా ? " అనుకుంటూ ఉండగా " ఏమండీ కుక్కలకి ఏదన్న పెడతారా ?" అని బయటనుండి ఓ మర్యాద పలకరింపు వినపడింది . లింగ డే రంగడికి దారి చూపినట్టు ఉందని మిగిలిన చద్దన్నము తీసుకెళ్లి అతడికి ఇచ్చేసాను . అతడు నా లాగానే నా కన్నా

బాగుగానో వున్నాడు . చేతిలోస్కూల్ బాగ్ కూడా వుంది .అతడు తన స్కూల్ బాగ్ లోనుండి ఒక స్టీల్ ప్లేట్ తీసి నేనిచ్చిన అన్నం ఆ ప్లేటులో పెట్టి కుక్కకు తినిపించాడు .తిన్న కుక్క వెనక్కి వెళ్లి పోయింది . అతడు ముందుకు వెళ్ళాడు . అతడు మా స్కూల్ వాడే కానీ మా క్లాస్ వాడు కాదు అని - చివరికి మావూరి వాడు కూడా కాదు - ఎవరో కొత్తగా వచ్చారు అని గ్రహించుకున్నాను .
ఇది మొదలుగా తరచూ కాక పోయినా - అప్పుడప్పుడూ మా వీధిలోకి వచ్చేవాడు . ఒక్కొక్కప్పుడు అతని వెనుక ఐదారు కుక్కలు ఉండేవి .
ఈ లోపున మా అక్క గారు ఆ అబ్బాయిని చూసి కొన్ని కూపీలు లాగింది . అతని పేరు ఈశ్వర్ .తల్లీ తండ్రీ లేరు . - ఈ ఊరి దాతలు వజినేపల్లి వారు " నీకు అన్నానికి ఏర్పాట్లు చేసి , నీకు చదువు చెప్పించుతాము " అని భరోసా ఇవ్వగా - ఒక పల్లె నుండీ అతను ఈ వూరికి తన ముదుసలి అమ్మమ్మ తో సహా వచ్చాడు . అదీ అతని నేపధ్యము . ఒరే

అన్నా అరే అన్నా పలికేవాడు . చద్దెన్నం పెట్ట దలుచు కున్న వారు "  ఓ కుక్కలబ్బాయి ఇలారా అంటే వచ్చే వాడు . అతడి పేరు  కుక్కలబ్బాయి గా మారింది. ఆకుకూరలు అమ్మే వాడికి ఉన్న పేరు పోయి అక్కూరలబ్బాయి  అన్న పేరు స్థిరపడినట్లు జరిగింది అను  కొండి .

ఒకనాడు మా అక్క గారు ఆ అబ్బాయిని చూసి " బాబూ మంచి కుటుంబం నుండి వచ్చావు లాగుంది . చదువుకునే వాడివి . ఈ కుక్కలేమిటి ? ఈ అడుక్కోవటం ఏమిటి ? " మీ ఇంట్లో అమ్మమ్మకు తెలుసా " అని ప్రశ్నించింది .
అప్పుడతడు " అక్కా నాకు కుక్కలంటే ప్రేమండీ . అవి పొద్దున్నే పెళ్లి ఎవరినీ చద్దన్నాలు అడుక్కోవుగా ? అందుకని నేను చద్దన్నలా గురించి అడిగి కనుక్కొని వాటికి తినిపిస్తూ ఉంటాను . కుక్కలు విశ్వాసంలో మనుషుల కన్నా గొప్పవి . మీ వీధిలోకి దొంగలు రాకుండా అవి ఆపుతాయి చూడండి " అని బదులిచ్చాడు .

అప్పుడు మా అక్కగారు ఈ కుర్రవాడితో "నీ కుక్కలు ప్లస్ నీ పేరు ఈశ్వర్ కలిపి క్కుక్కుటెశ్వర్ " అని పిలిస్తేనే పలుకు . కుక్కలబ్బాయి అన్న పేరేమిటి ? అసహ్యంగా " అన్నది .
కుక్కుటెశ్వర్- ఇంటి నుండి బడికి వెళ్లే దారిలో నేరుగా పోకుండా సందుల గోండుల కుండా పోతూ అనేక వీధి కుక్కలకి అన్నం పెట్టిస్తూ ఉండేవాడు . ఇతడు పెరిగి పెద్ద అవుతే గొప్ప వాడు అవుతాడని మా అమరావతి వారు అందరూ అన్నారుఅనుకున్నారు .నా ఇంటర్ అయిన తదుపరితరువాత కొన్నేళ్ల పాటు అతడు మావూరిలో కనపడలేదు .కకనపడినప్పుడు - అతడు ఒక డాక్టర్ అయి మావూరిలోకి వచ్చాడు . ఇతడు పట్నంలో ఉండగా , పట్నం లోని ఒక సంపన్నుడు , కుక్కల పట్ల ఇతడి మంచి తనం గుర్తెరిగి - ఇతడే సాయి అనుకుంటూ - కుక్కల నిమిత్తము ఒక ఆశ్రమం కట్టించి - ఇతడి చేతిలో పెట్టాడు . ఎన్నో కోట్ల టర్నోవర్ ఉన్న తన పొగాకు- మరియూ ఎండు మిర్చీ బిజినెస్ లో నుండి కుక్కలా

ఆశ్రమానికి వాటా రాసి ఇచ్చాడు .ఈ ఆశ్రమ నిర్వహణ ద్వారా కుర్రవాడిని పరీక్షించీ పరీక్షించి మొత్తం తన ఆస్తులన్నిటిని తన ఒక్క గానొక్క కూతురుకి రాసిచ్చి - ఆ కూతురుని ఇతని కిచ్చి పెట్టి పెళ్లి చేసాడు . ఆ పిల్ల గూడా బంగారు తల్లియే . భర్తతో పాటు ఊరిలోకి వస్తూనే భర్త కోసం "సాయి నిలయం"అని ఒక ఆసుపత్రి కట్టించింది .
మీరు గమనించారా ? ఇంతసేపూ నేను ఎక్కడా కూడా కుక్కుటెశ్వర్ రావు అని పేరు పలకలేదు దు . డాక్టర్ చదివిన వాడిని, ఒక నిక్ నేముతో పిలవలేము కదా ? సాయి నిలయం డాక్టర్ ఈశ్వర్ గారు అని గుర్తు పట్టేటట్లుగా హాస్పిటల్ పేరు "సాయి నిలయం" నుండి "సాయి "ని అసలు పేరు నుండి ఈశ్వర్ ను తీసుకొని ని అతడిని " సాయి ఈశ్వర్ " అని పిలిచారు మావూరివారు . .

సాయి ఈశ్వర్ హాస్పిటల్ లో నామమాత్రపు ఖర్చుకు అత్యుత్తమ వైద్యం జరిగేది .

ఎక్కడెక్కడినుండో పెద్ద పెద్ద డాక్టర్లు వచ్చి చూసి పోతూ వుండే వారు .
సాయి ఈశ్వర్ గారు నేడు డెబ్బై లేక ఎనుబది ఏండ్ల వాడైనాడు కావచ్చు .ఆయన భార్య గతించింది . ఆమె గుర్తు కోసం " విశ్రాంతి మందిరం " అని ఒకటి కట్టించాడు . ఫుల్ ఏసీభవనము . దారిన పోయి ఎవరైనా సరే లోనికి పోయి ఎంతసేపైనా విశ్రాంతి తీసుకోవచ్చు .ఈ భవనంలో అయన వున్నపుడు - చిన్నల నుండి పెద్దల వరకూ ఎవరైనా సరే వెళ్లి తమ ఆరోగ్యం గురించి -ఆయనతో తృప్తి తీరా మాట్లాడ వచ్చును.
స్కూల్ లో పేరెంట్ టీచర్ మీటింగ్ జరిగినట్లు ఈ విశ్రాంతి భవనం లో పేషెంట్ డాక్టర్ మీటింగు జరుగుతుంది . పేషెంట్లు తమ ఆరోగ్య సమస్యలకు సరైన వైద్యం దొరుకుతున్నదో లేదో ఈ మీటింగ్లో పాల్గొనే సూపర్ స్పెషలిటీ డాక్టర్లతో ఇష్టా గోష్టిగా మాట్లాడుకోవచ్చు . నో  ఫీజు . నో టెస్టులు . మీ మనసు తేలిక పడేదాకా మీరు అడిగిన ప్రశ్నళ్లన్నింటికీ ఆరోజున వున్నా డాక్టర్లు సమాధానం

ఇస్తారు . మీటింగులో పాల్గొన్న ప్రతి ఒక్కరూ నిబ్బరంతో ఇంటికి పోయే వీలు కలుగుతుంది .
వారణాసి శ్రీ రామ కృష్ణ స్వంత రచన

—-------------------------------------------------------------------

## 11-ఏడోతరం అత్తా కోడలు 09-03-24

" అమ్మాయీ కోడలా రేపో ఎప్పుడో మేము మావూరికి వెళ్లనున్నాము . నీతో మాట్లాడవలసింది వుంది . ఇలా కూర్చో " అన్నది అత్తగారు .

కోడలు అయిష్టంగానే అదే సోఫా మీద మరో పక్క ఒంటికాలుతో కూచుంది .

అత్తగారు ఇలా అన్నది " నువ్వు నన్ను మీ మామగారిని సరిగా చూసావా లేదా అన్న విషయం మీద నేను ఏమీ మాట్లా డను. మొదటగా నువ్వు మమ్ము చక్కగా చూసావు అనుకుంటే - అది నేను నా కొడుకులకు నేను ఆచరించి చూపిన మార్గము మరియూ అందుకు నీ సహకారమూ అని

సంతోషిస్తాను . నేను కోడలిగా వున్నపుడు నా అత్తా మామల భాద్యత తలకెత్తుకొని - వారి గౌరవానికి ఎటువంటి భంగం రానివ్వకుండా వారిని దాటించాను .ఇదే నేను నా పిల్లలకు చూపిన మార్గము . నేను చూపిన మార్గమును అనుసరించియే, మీరు నన్ను చూస్తూ వున్నారని భావిస్తున్నాను .
ఇక రెండోది మీరు నన్ను సరిగా చూడటం లేదు అనుకుంటే - .నా కొడుకే మారి ఉండవచ్చు . లేదా నువ్వే మార్చి ఉండవచ్చు . నాకొడుకే మారివుంటే అతనిని సరిదిద్దటం నీ చేతిలోని పని ఏ కదా ? ఇక మాపట్ల నీ భాద్యతలు గుర్తెరిగి ప్రవర్తించటం నీ చేతిలోని పనియే గదా ? ఏది ఎట్లా అయినా ఒక గృహ సారధిగా పెద్దల పట్ల ఒఇన్నాలు నిర్వహించ వాల్సిన భాద్యత గురించి నీ పిల్లల కు - సరిఅయిన మార్గ నిర్దేశము చేయ వలసిన దానివి నువ్వే . నీవు మార్గ నిర్దేశము చేయటంలో విఫల మైతే ఏమవుతుంది ? నీ వృధాప్య కాలంలో నీవే చిక్కులలో పడతావు . ఇప్పటికి అన్నీ సజావుగా ఉన్నప్పటికీ , నీకు నీ పెద్దతనం లో ఏమి చిక్కులు

, ఏమి అగచాట్లు వస్తాయో అని అలోచించి నా ఆస్తిలోని  కొంత ఆస్తిని నీకు రాసి ఇస్తూ వున్నాను . ఇది నన్ను సరిగా చూసుకొమ్మని కోరుతూ నీకు ఇస్తున్న లంచము లాంటిది కాదు . భవిష్యతులో నీకు ఓ అండగా ఉంటుందని అలోచించి ఇస్తున్న ఆస్తి ఈ కాగితాలు తీసుకో "

కోడలు కాగితాలు తీసుకున్నది .అత్తగారు ఇంకా ఇట్లా అంది " మొత్తం ఇరవై ఎకరాల ఆస్తి లో సగం నీకు ఇస్తున్నాను .మిగిలినది నా తదనంతరం నీకే ముడుతుంది .  కడుపున పుట్టిన పిల్లలు - వచ్చిన కోడళ్ళు నన్ను ఏమి ఇక్కట్ల పాలు చేస్తారో ఏమో అన్న ముందు ఆలోచనతో  మా అత్తగారు నాకు ఈ భూమి ఇచ్చి పోయింది .ఇదే ఆలోచనతో మా అత్త గారికి ఆమె అత్తగాఋ - ఆమెకు ఆమె అత్తగారు ఇస్తూ వచ్చారు . ఇదే ఆలోచన తో ఇదే ఆస్తిని ఈ కుటుంబానికి చెందిన మొదటి తరం అత్తగారు కోడళ్ళకి ఇచ్చింది .  మా  ఏడోతరం కోడలిగా అట్లాగే రాబోయే తరం అత్తగారిగా నువ్వు  ఈ ఆస్తిని అందుకుంటున్నావు.  వృధ్యాప్యంలో స్త్రీలకూ వచ్చే

దుఃఖాలు అనేకం .ప్రతి  దుఃఖాన్ని ఎదుర్కోవటానికి డబ్బు ఆసరా ఎంతో అవసరం . ఈ ఇంటికి కోడళ్ళుగా వచ్చి   అత్తగార్లు అయిన వారు  ఎవరూ ఎట్టి పరిస్థితుల్లోనూ కంట తడి పెట్టరాదని మా మొదటి తరం అత్తగారి  ఆలోచనలోని సారము  . ఆమె తన పుట్టింటి వారు ఇచ్చిన ఆస్తిని , కొడుకులను కాదని కోడళ్ల పరం చేసింది .  అదే స్ఫూర్తితో అదే ఆలోచనతో , ఈ ఇంటి కోడలివి అయిన నీవు  నువ్వెన్నడూ కంటి తడి పెట్టరాదు అన్న కోరికతో నా  ఆస్తి నీ పరం   చేస్తూ వున్నాను " అన్నది

అత్తగారు  తన మేలు కోరుకోవటం చూసి కోడలి కంటి వెంట నీళ్లు కారాయి .  వేరే ఆలోచన చేయకుండా అత్తగారిని వాటేసుకున్నది .

కోడలు మారిందా లేక ఇరవై ఎకరాల ఆస్తి దక్కటం చూసి ఆనంద భాష్పాలు  కార్చినదా? ఆస్తి ఇచ్చిన పుణ్యానికి గానూ అత్తగారిని వాటేసు కుందా?  అనేది మీరే తేల్చుకోవాలి .

వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి సొంత రచన
—-----------------------------------------------------------
---

## 12-"విరోచనోపాఖ్యానము"    05-03-24

ఒకే రోజు రెండు పెళ్లిళ్లు ఉండటం మామూలు .ఒకేరోజు రెండు మూడు పెళ్లిళ్లు ఒకే ఊరులో వేరు వేరు ముహూర్తాలకు ఉండటం అంటే అదృష్టము .ఉదయము ఒకపెళ్లికి వెళ్లి గట్టిగా టిఫిన్లు తిని, కాఫీలు టీ లు  డ్రింకులు తాగి మరొక పెళ్ళికి వెళ్ళాము . ఈ పెళ్లి మధ్యాన్నపు ముహర్తము ది . ఇక్కడ పెట్టిన బఫెలో పూరీలు బిర్యానీలు సలాడ్ వంటివి కడుపారా ఆరగించి ఇంకో మండపమునకు చేరాము . అక్కడ పెళ్లి రాత్రి ఫది గంటలకు .వీరు రాత్రి తొమ్మిది గంటల వేళ వెజ్ నాన్ వెజ్ ఏర్పాట్లతో బ్రహ్మాండమైన విందు ఇచ్చారు . మాకు అరగదు అంటూ ఎక్కువమంది ఎవరూ తిన లేదు . తిన్నవారు ఎక్కువగా ఏమీ తినలేదు .ఎవరూ తినక

పోతే పదార్థాలు ఏమి కావాలె ? అని వడ్డించే వారు బ్రతి మాలీ, బ్రతి మాలీ వడ్డన చేయగా , మేము కాసేపు వెజ్ కాసేపు నాన్ వెజ్ చొప్పున ఎడా పెడా తిన్నాము. తిని మనకు ఎడ్ల బలము వున్నది లేకపోతే మనము ఇంతలా తినగలిగే వాళ్లము కాదు అని నేనూ నా బావుమరిదీ ఒకరి భుజము ఒకరము చరుచుకున్నాము . పెళ్లి తిండ్లు ముగించుకొని హైదరాబాద్ కి దారి పట్టాము .

తెల్లవారు ఝామున నాలుగు ఐదు మధ్య నా బావుమరిది నన్ను నిద్దరలేపి "

కడుపులో ఎదో గడబిడగా వుంది - టాయిలెట్స్ ఎప్పుడు వస్తాయంటావూ బావా ? "

అన్నాడు . ఇంకో పావు గంటలో బస్సు స్టాండ్ వస్తుంది . అందులో టాయిలెట్స్ వుండాలని ఎక్స్పెక్ట్ చేసే హక్కు నీకుంది " అని నేను చేప్పాను.

బస్సు స్టాండ్ వచ్చింది . అందులో రొండో మూడో టాయిలెట్స్ వున్నాయి , రద్దీకి తగ్గట్టు లేవు అనే చెప్పాలి . ఒక ఐదు వందలు తీసు టాయిలెట్ దగ్గర

కూచున్న వాడికి ఇచ్చాము ." ఫది " అంటూ వాడు ఆ నోటును వెనక్కి తోసాడు .

" నాకు అర్జెంటు . "చిల్లర సంగతి వచ్చినాక చూసుకుందాములే" అని మా బావమరిది అన్నాడు .ఇప్పుడు మాబామ్మర్ది కడుపు బిగపట్టుకొని - గర్భిణీ స్త్రీ లా పొట్టను తడుము కుంటున్నాడు . మొహంలో ని కండరాలు బిగతిప్పుతూ వదులుతూ వున్నాడు . వర్ణించటం బాగోదు కానీ టాయిలెట్ ఆపుకోలేని వారు ఏమి పోకడలు పోతారో ఆ పోకడలన్నీ పోతున్నాడు .

' టాయిలెట్కీపర్ ఇట్లా అన్నాడు " అట్లా కుదరదండీ . అప్పుడు మటుకు చిల్లర ఎక్కడనుండి వస్తుంది? . కాబట్టి మీకు జరూర్ అంటే - అటు చూడండి . అవి వీ ఐ పీ టాయిలెట్రూములు . అందులో డీలక్స్ టాయిలెట్ లు - ప్రైవేట్ టాయిలెట్స్ - సెమి ప్రైవేట్ టాయిలెట్స్ - డబల్ షేరింగ్ టాయిలెట్స్ వున్నవి . దేని కైనా 500 రూపాయాలే . డీలక్సు అంటే అది కంటిన్యూగా ఒక గంట మీకింద ఉంటుంది . ప్రైవేట్

అంటే నాలుగు గంటలు పూర్తిగా మీకింద ఉంటుంది .దీనిలో క్యాష్ బ్యాక్ ఆఫర్ కూడా ఉంటుంది . మీరు ఇష్టపడితే - అది ఖాళీగా వున్నపుడు బయట ప్యాసెంజర్స్ ని మేమే అందులోకి పంపుతాము , ఆ వచ్చిన డబ్బులు ఏవో మీకే ఇస్తాము . అదే మా క్యాష్ బ్యాక్ ఆఫర్ . సెమి ప్రైవేట్ అంటే నాలుగు గంటలు పూర్తిగా మీకింద ఉంటుంది మీరు ఇద్దరూ కలిసి టాయిలెట్ తీసుకొని - ఇద్దరూ వాడు కోవచ్చు - అది ఖాళీగా వున్నపుడు బయట ప్యాసెంజర్స్ ని మేమే అందులోకి పంపుతాము , ఆ వచ్చిన డబ్బులు మూడు వాటాలు వేసి మనము పంచుకుంటాము . ట్విన్ షేరింగ్ అంటే అచ్చం మీ ఇద్దరికే . పూర్తిగా ఐదు గంటల పాటు మీదే . అవసరాన్ని బట్టి మీ ఇద్దరూ ఒకేసారి లోనికి వెళ్లినా మేము పట్టించుకొము. శానిటైజేషన్ కు అని ఏమీ ఎక్స్ట్రా చార్జీలు ఆడగము " అన్నాడు .

అతను అన్నది -నేను విన్నది - ఆకళింపు చేసుకొనే లోపునే మా బామ్మర్ది పరుగెత్తి కెళ్ళి డీలక్స్ లో దూరి

పోయాడు .   నాకు కూడా ఎదో అనుమానము వచ్చి అదట్లా పోనిండి . ఇప్పుడొక ట్విన్ షేరింగ్ ఇవ్వండి " అన్నాను .
బావా బావమరుదులు కలిసి యాత్ర చేస్తే ఇలానే ఉంటుంది . వాడి దారి లేదా వాడి సుఖం వాడు చూసుకుంటాడు. మన గురించి పట్టించుకోడు .  నా అక్కసు కొద్దీ వాడికి విరోచనుడు అనే నిక్ నేము తగిలించాను .

- ఇతి విరోచనోపాఖ్యాన సమాప్తం -
వజ్రయాన బుద్ధిజములో ఉండే ఐదు మూర్తులలో -బుద్ధుడు " విరోచనడు" అనే మూర్తి  గా కూడా దర్శనం ఇస్తారు ..
ఏవో హిందూ పురాణాల ప్రకారం- విరోచనుడు భక్త ప్రహ్లాదుని కుమారుడు . ఇతడు దేవతలకు విరోధి. ఇంద్రుడు ఇతనిని చంపి వేస్తాడు - బలి చెక్రవర్తి ఇతని కుమారుడు  -  .విరోచనడు " అనే సంస్కృత ప దానికి  " బ్రిలియంట్ అండ్ కళ కళ  లాడు మోము " కలవాడు అనే అర్ధం ఉన్నట్లు   ఇంటర్నెట్లో

సమాచారం వుంది. అందువల్ల మా బావుమర్దికి వాళ్ళ అక్క అనుకున్న అన్యాయం ఏమీ జరగలేదు

a original by varanasi sree rama krishna



image is the idol of bhudda as virochana

—-----------------------------------------------------------------------

## 13 రాజుగారి నూటొక్క పెళ్లి ఒకే అయ్యింది
## 01-03-24

ఒకానొక రాజు గారు వున్నారు . ఆయనకు అప్పటికే నూరుగురు భార్యలు వున్నారు . ఇప్పుడు నూటొక్కవ పెండ్లి చేసుకో బోతూ వున్నాడు .కారణం ఇప్పటికే వున్న నూరుగురు భార్యల వల్ల ఆయనకు మొగ  పిల్లలు పుట్టలేదు అని .

రాణులందరి లోనూ కలకలం మొదలైంది . వాళ్లలోనే వాళ్ళు చేర్చించుకొని  రాజుగారితో " మా వందమందిలో  ఒక్కరు కూడా కనలేని మొగ పిల్లాడిని ఆ కొత్తగా వచ్చినామె కంటుంది అనే నమ్మకం ఏమిటి ? అసలు మొగపిల్లాడే కావాలని మీకెందుకు అంత పట్టు దల  ? మేము మీకు త్రీవ్ర నిరసన తెలుపుతున్నాము - అంటే ప్రతి ఒక్కరం విషము మింగి చస్తాము  " అని చెప్పారు .

రాజు ఇట్లా అన్నాడు " రాజ్యము చేయటం అంటే పన్నులు వసూలు చేయటమే .నేను మానాన్నకు

పుట్టిన మొగ బిడ్డను కాబట్టి -ప్రజలు నన్ను రాజుగా గుర్తించి నేను అడిగిన పన్నులు కడుతున్నారు . ఆడపిల్ల రాజైతే " ఆడది ఏమిచేస్తుందిలే " అనుకుంటూ - పన్నులు సరిగా కట్టరు. పైగా ఇంత పన్నులా అంటూ తిరుగు బాట్లు కూడా చేస్తారు.శిక్షించి అయినా సరే ప్రజలనుండి పన్నులు రాబట్టటం ఒక్క మొగవారి వల్లే అవుతుంది . కోమల హృదయము వున్న ఆడపిల్ల వల్ల కాదు . అదే మనకు ఒక్క మొగపిల్ల వాడు కలిగి వాడు రాజు అయితే పన్నుల వసూళ్ళలో ఏమీ డోఖా ఉండదు. వాడు చక్కగా పన్నులు వసూలు చేసి - ఆ డబ్బుతో , తన తల్లులైన ,మీకు వజ్ర, వైదూర్య, రత్నాలు, పొదిగిన బంగారు ఆభరణాలు - చేయించుతాడు.ఇట్లా నా తదనంతరం కూడా మీకు బంగారు నగలు వస్తూనే ఉంటాయి " అదే ఆడపిల్ల రాజైతే , ఆ వచ్చే పన్నులు అది నగలు చేయించు కోవటానికే చాలవు" అన్నాడు రాజుగారు

"బంగారం లాంటి ఆలోచన .మీరు చక్కగా నోటోక్కో పెండ్లి చేసుకోండి. మోమొచ్చి సందడి చేస్తాము " అన్నారు ఆ వందమంది రాణులు .
అట్లా రాజుగారి నూటొక్క పెళ్లి ఒకే అయ్యింది .

a original by varanasi sree rama krishna amaravathi

—-----------------------------------------------------
--

## 14 ఏడేడు జన్మల భంధం 29-02-24

ఏడేడు జన్మలకూ నేనే నీ భర్తను - నువ్వే నా భార్యవు అన్న భావనకు ప్రతి దంపతులూ ఎంతో ప్రాముఖ్యము ఇస్తాము . ఆలా చెప్పుకోవటమే భార్య భర్త ల మధ్య ప్రేమకు గీటు రాయి గా భావిస్తాము .

తదుపరి  జన్మ గురించే స్పష్టంగా రుజువులు దొరకనప్పుడు ఏడేడు జన్మల బంధం గురించి ఎందుకు ఊహలు బయలు దేరాయి ? - అని ఆలోచించుదాము

నా వద్దవున్న అతి పురాతన గ్రంధాలలో రాసిన దాని ప్రకారము - ప్రతి జంటకు   {1}మానసిపరంగానో {2}ఆరోగ్యపరంగానో {3} -ఆర్ధిక పరంగానో {4} వ్యావహారిక పరంగానో  {5}- పాటించ వలసిన నీతి నియమాల   పరంగానో {6}ఆచరించవలసిన ధర్మ పరంగానో {7}- చేయవలసిన ఆలోచనా పరంగానో - అనేక సంకట పరిస్థితులు ఎదురు అవుతాయి . ఈ ఏడూ సంకట స్థితులే యేడు జన్మలు
 అని మన పూర్వీకుల ఉద్దేశ్యము . ఈ యేడు సంకట పరిస్థితులలో లేదా యేడు జన్మలలో  - నీకు  ఏమి భాద కలిగినా నేను నిన్ను ఊరడించి - నీ మనసు కోరిన  ప్రకారము నిన్ను బాధలనుండి బయటకు తెస్తాను " అని దంపతులు ఒకరికి ఒకరు బాస చేసు కోవటమే  ఏడేడు జన్మల బంధం అంటేనూ .

జనము  ఏదన్నా సంకట స్థితి / గడ్డు స్థితి నుండి దాటి బయట పడినపుడు --
చచ్చి బ్రతికినంత పనైంది అని -ఆ పరిస్థితులలో నేను బ్రతికి ఉందాము  అనుకోలేదు-  అనే మాటలు ప్రయోగిస్తూ వుంటారు . దీనిని బట్టి చావకుండా లేదా చని పోవాలి అన్న తలపునుండి బయటికి రావటమే మరు జన్మ అంటేనూ  .

నేటి పరిస్థితుల ఉదాహరణప్రాతి పదికగా  ఇంకా కొంచము వివరణ చేస్తాను .

ఒక దంపతులలోని పురుషుడికి తల్లీ తండ్రి వున్నారు . అతని అత్తా మామా కూడా అతనినే ఆశ్రయించారు అనుకోండి .వీరికెట్లాగో ఇద్దరు పిల్లలు తప్పదు . మొత్తము నాలుగు వృద్ధ  జీవితాలు, ఇద్దరి పిల్లల భావి జీవితాలు ఈ  దంపతుల చేతిలో వున్నాయి . ఆ నాలుగు వృద్ధ  జీవితాలు కడతేర్చే సరికి - పిల్లలని పెంచి పెద్దచేసి  సరికి - ఈ దంపతులు నేను  పైన చెప్పిన ఆ ఏడు సంకట పరిస్థితులను ,ఎప్పుడో ఒకప్పుడు--  తప్పక   ఎదుర్కొనే    తీరుతారు  .

దీనికి తోడు ఒక కష్టం లో ఉండగా ఇంకో కష్టం రాకూడదు అనే రూల్ ఏమీ లేదు గదా ? .

ఇప్పుడు చూస్తే ఈ ఏడు సంకటలలో కూడా భార్యా భర్తా ఒకరి కొకరు వత్తాసు లేదా తోడుగా ఉంటేనే వారి వారి తల్లి తండ్రుల జీవితాలు ప్రశాంతంగా ముగిసి పోవటానికి - పిల్లలు ప్రయోజకులు కావటానికి వీలుంది . భార్యాభర్తలకు ఆపాదింపబడిన "ఏడు ఏడు" జన్మల బంధము అన్నది , సమాజానికి ఒక శ్రేయస్సు ని ఆశించి ఏర్పరిచిన పద బంధము . అందువల్లనే ఏడేడు జన్మల బంధం అనే మాట ప్రోత్సహింపబడింది . అంతేగానీ పుట్టిన ఏడు జన్మల పాటు వారే తిరిగి తిరిగి భార్య భర్త అవుతారని కాదు .

నేటి భార్య భర్తలు ఒకరికొకరు తోడుగా ఉంటూ తమ పెద్దలసంరక్షణ చూసే సంకట జీవితాన్ని ఆమోదించలేక పోతున్నారు .
మా అమ్మ నాన్నలను చూద్దాము అని కొడుకు అంటాడుఅనుకోండి . నావల్ల కాదు -నేను చేయలేను . నాజీతం నుండి ఒక్క పైసా ఇవ్వను - మన

కర్చులకే మీజీతం చాలటం లేదు --అని భార్య అన్నపుడు పురుషుడికి 1}మానసిక {2}ఆరోగ్య {3} ఆర్ధిక సంకటాలు ఎదురవుతాయి .
" ఈ పెద్దలను తీసుకెళ్లి వృధాశ్రమము లో వదిలి వేయండి " అని భార్యఅన్నపుడు పురుషుడు {4} వ్యావహారిక సంకటం {5} నీతి నియమాల సంకటం {6}నేను నా తల్లి తండ్రులను ఇట్లా చేయటం ధర్మమా? అనే ధర్మ సంకటం --- చివరికి ఏమి చేయాలో తేల్చుకోలేని - {7}ఆలోచనా సంకటం పురుషుడు ఎదుర్కొంటాడు . భార్య తోడులేక పోబట్టే గదా అతడీ సంకటాలు ఎదుర్కొంటున్నాడు . అంటే వారిద్దరి మధ్య ఏడేడు జన్మల బంధం అనేది ఓ డొల్ల మాట .ఈ ఏడేడు జన్మల బంధం అనేది ఆలూ మొగల మధ్య లోపించిన పరిస్థితుల్లోనే నేడు అనేకమంది వృద్ధులు నరకప్రాయమైన జీవితాన్ని ఎదుర్కొంటున్నారు .
అంతా పురుషుడి పరంగా చెప్పారు మా సంగతి ఏమిటి అని కొందరు స్త్రీలు అనవచ్చు . నేడు పురుషుడితో సమంగా స్త్రీలుకూడా ఈ సంకటాలను ఎదుర్కొంటున్నారు . వారి భర్తలు వారికి తోడ్పాటు

అందిస్తూ ఉంటే వారి మధ్య ఏడేడు జన్మల బంధము వున్నట్లే-- లేకపోతే లేనట్లే -- శుభం --

వారణాసి శ్రీ రామ కృష్ణ --అమరావతి -- స్వీయ రచన
—-----------------------------------------------------

**15 బాతు చెప్పిన సైన్సు పాఠము 28-02-24**

నేడు అనగా 28 -02 -24 న ప్రపంచ సైన్సు దినోత్సవం . వినాయక చవితి రోజు వినాయకునికి పూజ చేసి ఉద్వాసన చెప్పినట్లు . -- నేడు రేడియో లోను పేస్ బుక్కు లోను ప్రఖ్యాత భారత శాస్త్రవేత్తలను గురించి చెప్పుకొని ముగించారు . కానీ కఠినమైన సైన్సును గురించి సామాన్య యువకులకు ఒక ఆసక్తిని కలిగించాలన్న ఆలోచన ఎవరూ కనపరచలేదు .

నేటి యువతలో కానీ పిల్లలలో కానీ సైన్స్ పట్ల ఒక ఆసక్తి కలిగించాలనే కోరికతో ఒక జాపనీస్ సైన్టిస్ట్ -- చెప్పిన సైన్స్ కధనాన్ని ఇక్కడ ఇస్తూ వున్నాను .

ఒక సరస్సు నీటిలో ఒక బాతు పోతూ వున్నది . దాని వెనుక దాని పిల్లలు పోతూ వున్నాయి . తల్లి బాతు పెద్దది కాబట్టి బలంతో ఈదుతున్నది . మరి పిల్లలు ఈదుతున్నాయా ? వాటికి తల్లి తో సమంగా యిదే బలము ఉన్నదా ? అవి తల్లిని ఎట్లాఫాలో అవుతున్నాయి ?

తల్లి పోతూ పోతూ పోతూ "న్యూక్లియర్ అక్లిరేషన్" అనేది కలుగ చేస్తున్నది . అంటే నీటి అణువులు వేగంగా వెనక్కు తప్పుకుంటూ ఉన్నందువల్ల - అక్కడ పిల్ల పక్షులు ఎదుర్కోవాల్సిన నీటి అణువులు చాలా వరకూ తగ్గి పోతున్నాయి . అందువల్ల పిల్లబాతులు తమకున్న కొద్దీ పాటి శక్తితో తల్లిని అనుసరించ గలిగి వున్నాయి . ఇంకా చెప్పాలంటే మనము ఒకచీపురుతో చిమ్మి - దుమ్మును తొలగించినట్లు తల్లి బాతు నీటి అణువులను తొలగిస్తూ పోతూ వున్నది .ఇదీ పాపులర్ సైన్సు అంటే .

న్యూక్లియర్ ఆక్సిలరేషన్? = అనగా ఒక పదార్ధములోని అణువులను  వేగంగా పరిగెత్తించటం . ఇది న్యూక్లియర్ ఫ్యూషన్ కి ప్రత్యాన్మాయం ? న్యూక్లియర్ ఫ్యూషన్ లో ,  పదార్ధాన్ని వేడి చేసి అణువులనుపరిగెత్తించి ఒకదానితో ఒకటి  కలిపి ఇంకో క్రొత్త అణువును సృష్టించటం .కొత్త అణువు సృష్టి అయ్యే క్రమంలో విడుదల అయిన  శ్శక్తినే న్యూక్లియర్ పవర్ స్టేషన్స్ లో ను , న్యూక్లియర్ బాంబులలోనూ  ఉపయోగిస్తారు . న్యూక్లియర్ సైన్సు మీద ఎవరు ఏమి పరిశోధన జరిపినా   --  అక్కడ అణుబాంబు తయారీ జరుగుతున్నది అని అమెరికా వారుఆరోపిస్తుంటారు .

కాదు మేము అణువిద్యుత్ చేసుకుంటున్నాము అని ఎదుటివారు సమాధానము ఇస్తారు .

ఒక పదార్ధము లోని అణువులను విడదీసి  - వేరే అణువులతో కలపటానికి  ఆ   పదార్ధాన్ని వేడి చేయాలి .{ బంగారంలో రాగి కలపటం } అందుకోసమని  ఎంతో ఉష్ణ శక్తీ అవసరం . ఉష్ణ  శక్తీ ఏదీ  అవసరం లేకుండా - ఒక పదార్ధము లోని

అణువులు వేగం పుంజుకొని ఒకదానికి ఒకటి గుద్దుకొని- ఒకదానిలోనికి ఒకటి కలిసి పోయే పరిస్థితి కల్పించటమే నేటి న్యూక్లియర్ ఫ్యూషన్ . ఒక కారు ని ఇంకో కారు వేగంగా వచ్చి గుద్దుకుంటే విడుదల అయ్యే శక్తి ఎలా ఉంటుందో - ఆలోచించండి. అణువులు వేగంగా పరిగెత్తి ఒక దానికి ఒకటి గుద్దుకుంటే అలా అవుతుంది . ఆ గుద్దుడు లోనుండి వచ్చిన శక్తిని వుపయోగించి అణు విద్యుత్ టర్బైన్లు తిప్పి విద్యుత్ ను తయారు చేయవచ్చు . ఇప్పుడు ఉష్ణ శక్తి ఏదీ లేకుండానే అణువులను పరిగెత్తించి ఒకదానితో ఒకటి గుద్దు కొనేలా చేయటం ఎలా ? అన్నది ముఖ్య ప్రశ్న అయ్యింది . దీన్ని గురించి జపాను శాస్త్రవేత్త సాధారణ ప్రజలకోసం ఇలా వివరించారు . ఒక కాంతి కిరణాన్ని ఒక చీపురు కుంచె లాగా మార్చి - దాన్ని లోహాల కుండా పంపితే - ఆ కాంతి కిరణం ఆ లోహంలోని అణువులను కాంతి వేగంతో బయటకు లాక్కో వస్తుంది . ఇదేరకంగా ఎదురునుండి కూడా ఒక కిరణాన్ని రప్పించి రొండు కాంతి కిరణాలను ఒకదానితొ ఒకటి గుద్దిస్తే

ఏమవుతుంది .? ఈ గుద్దుడు ధాటికి - అణువులను వేడి చేయనవసరం లేకుండానే , అవి ఒకదానితో ఒకటి కలిసి పోయి శక్తిని విడుదల చేస్తాయి .ఇందుకోసం అని కాంతి కిరణాన్ని ఒక చీపురు లా గా మార్చి పని చేయించాలి .మన ఇంట్లో మనము ఆడించే చీపురు వేగాన్ని బట్టి ఏ గదా నేలమీద దుమ్ము అణువులు పైకి లేస్తున్నాయి కదా ? అలాగలన్న మాట . మెటల్ లోనుండి చీపురులా దూసుకు పోయే ప్రత్యేకమైన కాంతి కిరణాన్ని -- అనగా న్యూక్లియర్ ఆక్సిలేటర్లను ఇప్పటికే కని పెట్టారు . ఇకముందు ముందు వీటిని వాడి అణు ఇంధన రియాక్టర్ లను నడిపించి ,చవుకగా, తేలికగా , పర్యావరణానికి ముప్పు లేకుండా -- కావాల్సినంత విద్యుత్ ఉత్పత్తి చేయనున్నారు .
ప్రకృతిలోను- చివరికి ఇంటి ప్రతి పని లోనూ -- అంతటా సైన్ వున్నదని - గమనించటం ద్వారా యువత సైన్స్ పట్ల ఆసక్తి పెంచుకోవాలని ఆ జాపనీస్ శాస్త్ర వేత్త అన్నాడు . ఒక మామూలు తల్లి బాతు తనకు ఎంతో ప్రేరణని ఇచ్చిందని ఆయన చెప్పాడు .

నేడు ఈయన  ప్రపంచ వ్యాపితంగా నిర్మితము అవుతున్న అనేక నూతన అణువిద్యుత్  కేంద్రాల రూపకల్పనలో  మార్గదర్శిగా వున్నాడు . డబ్బు గౌరవములకు కొదవలేదు .

మనయువత- ప్రకృతిని గమనిస్తూ  సైన్స్ పట్ల ఆసక్తి కలిగించుకొని పరిశోధనలు చేస్తే- వారికి వచ్చే కీర్తి ప్రతిష్టలకు , డబ్బుకు - వారి ద్వారా భారత దేశానికి వచ్చే కీర్తి ప్రతిష్టలకు కొదువ ఉండదు .
ఈ శాస్త్రవేత్త చెప్పినదే ఇంకొన్ని ముక్కలు చెబుదామని అనిపించింది గానీ - గడ్డు ముక్కలు నమలటానికి జనంలో ఇష్టత తక్కువగా ఉంటుందని అలోచించి ఆపేసాను .

సమర్పణ వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి

—-----------------------------------------------------------------------

**16–అత్తగారికి చెత్త  వైద్యం -**  18-12-22  మళ్ళీ 26-02-24

వారిది ఒక వ్యవసాయక కుటుంబం . కోడలు పేరు కోమలి . ఒత్తి డబ్బు కాపీనం మనిషి . కోమలి అత్త వెంకట సుబ్బమ్మ , భర్త మరణించాక కూడా పొలము పాడీ చూసుకుంటూ తన భర్త ఏర్పరిచిన పెంకుటింట్లోనే ఉంటూ , కాలం వెళ్లబుచ్చుతున్నది . వెంకట సుబ్బమ్మ=వెంకమ్మ కు వయసు మీద పడటం వల్ల తరచూ డాక్టర్లను చూడటం తప్పని సరి అవుతున్నది . ఒక సారి ఆమె తన మెడలోని గొలుసు అమ్మి కూడా వైద్యం చేయించుకోవాల్సి వచ్చింది . ఈ నేపథ్యంలో కోమలి బాగా అలోచించి -- అత్తగారు తాను కూడపెట్టుకున్నది - ప్లస్ మామగారు వదిలి వెళ్ళినది మొత్తము అంతా కూడా వైద్యం కోసం కరిగిస్తూ వున్నదని - ఇట్లా అయితే మన పిల్లలకి మిగిలేది చిప్పే అని మొగుడి ముందు కన్నీరు పెట్టుకుంది . అతడు కరిగిపోయాడు . కరిగి కారి పోవటంతో అతని తప్పు ఏమీ లేదు .కలకంఠి కన్నీరు తన పవర్ చూపింది . " నీ ఇష్టం ఏమి చేస్తావో చేయి " అని అతడు అస్త్ర సన్యాసం చేసాడు . కోమలి పల్లెకు వెళ్లి తన అత్తగారిని తన కంట్రోల్ లోకి తీసుకుంది -అంటే ఎగిరి పోట్లాడి రచ్చ చేసి అత్తా గారి

బంగారు వస్తువులు,  నగదు నిల్వను తన పరం చేసుకున్నది . అత్తగారికి పైసా అందకుండా పొలం తాలూకు కవుళ్ళు అన్నీ గూడా తనకే మళ్లించుకుంది . "పొదుపు ఫథకం"  ద్వారా అత్తగ్గారిని కడకంటా చూడాలని  నిర్ణయం తీసుకొని ,అత్త  గారిని తెచ్చి ఇంట్లో పెట్టుకుంది  . " ఆమెను ఆ పల్లెలోనే  వదిలేస్తే, నాలుగు డబ్బులు కనపడగానే పట్నం లోని  మంచి ఆస్పత్రికి వెళ్లి,  ఏవో లేని పోనీ  జబ్బులకు ఉన్న డబ్బులు ఖర్చు పెడుతోంది .వైద్యం పేరున పట్టణం వెళ్లి తిరిగి రావటం , మీఅమ్మకు అలవాటు గానూ కాలక్షేపం గానూ  అయి పోయింది . అదే ఆమె ఇక్కడే ఉంటే మన వీధి చివరి వున్నా చిన్న డాక్టర్ గారికి చూపిస్తాను  . ఆయన ఫీజు తక్కువ . ఎక్కువ మందులు రాయడు . మీ అమ్మ పెట్టె హాస్పిటల్ ఖర్చులో మనకు 90 % అదా అవుతుంది . తెలిసిందా ? " అని కోమలి వాళ్ళాయనకు క్లాసు ఇచ్చింది .అతడి చే  ఒప్పించింది .అతడు ఒప్పుకోక పోయినా తాను చేయ దలుచుకున్నదేదో చేయగల మనిషే కోమలి .  ఇక మన కోమలి ఎంత కాపీనం మనిషో చూడండి .. " కోడలా నాలిక పీకుతోంది .. ఆ

ఆకు కూరల వాడి దెగ్గర కాస్త గోంగూర కొనమ్మా "
అని అత్తగారు అడిగితే చాలు " గోంగూర ఎందుకు ?
దండగండి . ఫది రూపాయలు పెట్టి కొన్నాక ఆ
గోంగూర కాడలువృధాగా పారేయాల్సి ఉంటుంది .
అదే తోటకూర కొంటె మొత్తం అత్తా కూర చేసుకోవచ్చు
" అంటూ అత్త కోరికను , దోమను నలిపినట్లు
నలిపేస్తుంది . ఒకనాడు అత్తగారు " అమ్మా కోడలా ,
డాక్టర్ కి చూపించుకొని మళ్ళా మందులు
రాయించుకోవాల్సిన రోజు వచ్చింది .పట్నం ,
హాస్పిట లు కు వెడదామా ? అని అడిగింది . "
ప్రాణాలు పోవాలంటే వూరికే పోతాయా ? . ఎదో రోగం
ఉండొద్దా ?రోగం గురించి అంత శ్రద్ధ ఎందుకు? మన
వీధి చివర ఒక డాక్టర్ గారున్నారు - అక్కడ
చూపించుకోండి . ఇక్కడ డబ్బులు పంపుల్లోనుండి
కారటం లేదు . నాకూ పిల్లలున్నాబు "అని ఒక
వంద అత్తగారి చేతిలో పెట్టింది కోమలి . వీధికి చివర
ఉన్న డాక్టర్ గారిని అందరూ పుస్తకాల డాక్టర్ అని
అంటారు . ఈయన ఎప్పుడూ ఎదో పుస్తకాలు
చదువుతూ ఉంటాడు . అవి మెడికల్ జర్నల్స్ అని
ప్రజలకు గ్రహింపు లేదు . పేషంట్ వచ్చిన చాలా

సేపటికిగాని ఆయన పుస్తకం లోంచి తల తీయడు . తల తీసినప్పుడు మాత్రం పేషేంట్ చెప్పినదంతా విని " రేపురండి - ఆలోచిస్తాను " అనే వాడు . వెంటనే ఏ మందులు రాసేవాడు కాదు . అందున ఈయనకు పెద్ద పేరు లేదు - జనం లేరు . వెంకమ్మ గారితో కూడా డాక్టర్ గారు ఇట్లాగే ప్రవర్తించాడు . ఈమె ఓపికగా రెండో రోజు కూడా వెళ్ళింది . అయన మళ్ళా రేపురా " అన్నాడు . ఈమె మళ్ళా వెళ్ళింది . ఈ సారి డాక్టర్ గారు యాభై ఫీజు తీసుకొని - ఎదో ఒకటి రెండు బిళ్ళలు రాసి ఇచ్చి - మీరు ఈ సరికే వాడుతున్న బిళ్ళలు అన్నీ అవసరం లేదు . మీ జబ్బు లక్షణాలకు ఇవి చాలు . నెలరోజులు వాడి మళ్ళా కనపడండి అన్నాడు . వెంకమ్మకు నెలకు మూడు వేల దాకా అయ్యే ఖర్చు ఇప్పుడు ఐదు వందలకి తగ్గి పోయింది . " నెలకు 2500 మిగులు . సంవత్సరానికి 30000 మిగులు - చూసారా నాతెలివి " అని కోమలి అందరితోనీ చెప్పుకుంది . " డబ్బు ఆదా సంగతి అట్లా ఉండనీ . నీకు త్వరలోనే అత్తగారి పీడా ఒదిలి పోవటం కూడా తథ్యం . ను హాయిగా టీవీ చూస్తూ పడుకోవచ్చు " అన్నది పొరుగింటామె . "

అవునా ?  ఇట్లా కూడా ఒకలాభం ఉందా ? అని కోమలి లోలోన నవ్వుకుంది  .  కాలం గడుస్తూ ఉన్నకొద్దీ కోమలి పెద్దది అంటే నలభయ్ దాటిన వనిత అయ్యింది . ఊబకాయం, నడుము నెప్పి, ఆయాసం,  ఆకలి లేకపోవటం, తింటే అరగక పోవటం వంటివి అన్నీ ఆమెవంట్లోకి  వచ్చేసాయి . పెద్ద పెద్ద హాస్పిటల్ చుట్టూ  తిప్పించుకుంది .ఆమె భర్తకు నెలకు పాతిక వేల ఖర్చు తేలుతున్నది . కోమలి భర్త సణుగుడు మొదలెట్టి " నీకు నీ పుట్టినింటి వారు నీకు పసుపూ కుంకుమల పెట్టినది అమ్మికొని  వైద్యం ఖర్చుగడుపుకో . వ్యాపారంలో నా పరిస్థితీ అంతంత మాత్రంగా వుంది " అని తేల్చి  చెప్పేసాడు . " కోమలి చాలాగా  తర్కించుకొని " మా అత్తగారిలా చెత్త వైద్యం చేయించుకొనే కర్మ నాకేమిటి ? " అనుకుంటూ ఆస్తులు అమ్మి వైద్యానికి వాడుకుంటూ రాసాగింది . ఇప్పుడు కోమలి ఓ మోస్తరుగా వుంది . అత్తగారి ఆరోగ్యమే  మెరుగ్గా వుంది . ఒక్కొక్క రోజున కోడలికంటే చురుగ్గాఉంటుంది .   " చెత్త వైద్యం ఇప్పించినా నా అత్త ముండ  చావకుండా వుంది . నా చావే ముందొచ్చేట్లు వుంది " అని ఇరుగు పొరుగుతో

వాపోయింది కోమలి . "నేను త్వరగా చనిపోతే డబ్బు ఆదా అవుతుందా ? లక్ష్మీ దేవి దయతలిచి ఇంతకు ఇంతకు ఇవ్వాలిగానీ ? అని తనలో తానే వాదన చేసుకుంది కోమలి . ఆపై డబ్బు ఖర్చుకు వెరవకుండా వైద్యం చేయించుకుంటూనే వుంది . చివరికి అమ్మటానికి ఆస్తులు కరువైనాయి చూసారా? ఈవాదనను ఆమె అత్తకు `వర్తింప చేయలేక పోయింది .అదే కోడలు అంటే . చిన్న చిన్నగా కోమలి యాభై ఏళ్ళు వచ్చాయి . ప్రతిదానికీ ఓ డాక్టర్ని చూడాల్సిన అవసరం ఏర్పడుతోంది . ఉన్నడబ్బు నిల్వలు తగ్గి పోతున్నాయి . చివరికి ఆమె కూడా వీధి చివరి పుస్తకాల డాక్టర్ను ఆశ్రయించాలిసి వచ్చింది .ఒకనాడు ఆమె పుస్తకాలడాక్టర్ఆ దెగ్గరికి వెళ్ళింది . అయన " ఓ రోగీ రూపురా " అన్నాడు ఎప్పటిలాగే . కోమలి ఆ రాత్రి టీవీ చూస్తూ ఉండగా - పుస్తకాల డాక్టర్ గారి ఫోటో చూపించి ఎదో చెపుతున్నారు . ఈమె శ్రద్ధగా విన్నది. వార్తల్లో విషయం ఏమిటంటే "పుస్తకాల డాక్టర్ గారు ఈ సాయంత్రం కారు యాక్సిడెంట్లో మరణించారు . అయన మృతి పట్ల అమెరికన్

ప్రెసిడెంట్ సంతాప సందేశం పంపారు . ఇప్పటిదాకా ఈ మట్టి లోని మాణిక్యం గురించి మనకెవరికీ ఏమీ తెలీదు . వీరు అనేక మెడికల్ రీసెర్చ్ గ్రంధాలు చదివి వాటిని క్రోడీకరించి - అమెరికన్ ప్రెసిడెంటుకి ఆరోగ్య సలహాలు - మందులు సూచిస్తూ వుంటారు . వీరి కుమారులు అమెరికన్ ప్రెసిడెంట్ గారి హెల్త్ టీం లో అతి ముఖ్యులు . వీరు - తమ తండ్రి నుండి సలహాలు , సూచనలు స్వీకరిస్తూ అమెరికను ప్రెసిడెంట్లకు , మెరుగైన వైద్యం అందిస్తూ వున్నారు అని నేటి అమెరికన్ ప్రెసిడెంట్ దృష్టికి రావటంతో - ఆయన ఈ పుస్తకాల డాక్టర్ మృతి పట్ల సంతాపం వెలిబుచ్చుతూ , తాను స్వయంగా సంతకాలు చేసిన సంతాప సందేశాలు అన్ని టీ వీ చానెల్స్ వారికీ -పంపారు"- ఇదీ వార్తలలో సారము . ఆ తరువాత ఒక నిముషము పాటు డాక్టర్ గారి ఫోటో టీవీ స్క్రీన్ పై చూపించి , విషాదపు మ్యూజిక్ వేశారు .

"అయ్యో అత్తకు అందినది చెత్త వైద్యం కాదా ? " అని కోమలి ఎంతో విచారించింది. కోడలు ఇప్పించిన . చెత్త వైద్యం వల్లనే వెంకమ్మ ఇప్పటికీ ఓపిగ్గా వుంది. అవసరమైనప్పుడు కోడలు ను చేయి పట్టి లేవదీస్తూ

వుంది .  వారణాసి శ్రీ రామ కృష్ణ - అమరావతి సొంత రచన - ఇంతకు ముందు రాసిన కాదనే తప్పులు సరిదిద్ది మరలా రాసాను

—-------------------------------------------------------

------**17–మా గూర్ఖా కనపడుట లేదు .**
**23-02-2024**

మా చిన్నప్పుడు మా అమరావతిలో - ఒక గూర్ఖా ఉండేవాడు . రాత్రి వేళ మా వీధులలో కాపలా తిరుగుతూ- ఈల ఊదేవాడు , చేతిలో ఉన్న కర్రతో ఇంటి తలుపు పై మోగించే వాడు . ఇంటి యజమాని నిద్రలేచి  " సట్ ఠీక్  హయ్ " అనే వాడు . వాళ్ళు అట్లా అన్నా అనక పోయినా గానీ--  మా గూర్ఖా తలుపులు మోగించుకుంటూ - ఇంటిలో వారిని లేపుతూ దొంగల పట్ల పోలీసు వుద్యోగం  చేస్తూ ముందు ముందుకు వెళ్లిపోయే వాడు .   ఈ  గూర్ఖా నెలకు ఒక సారి వచ్చి వాకిటి ముందు నిలబడితే - ఇంటి వారు అతనికి రూపాయి లేదా రెండు రూపాయలో  ఇచ్చి పంపే వారు . అదే అతని

జీవనోపాధి .   గూర్ఖాలు నేపాల్ వారు .వాళ్ళు ధైర్యానికి  ఉదాహరణలు అని  నాకు ఎవరో చెప్పారు . ఒక నాడు కొందరు దొంగలు -  " ఈ గూర్ఖా వీధులలో తిరుగుతూ - కుక్కలని మొరిగిస్తూ - యింటివారిని నిద్రలు లేపుతూ మన  దొంగ తనాలు నిశ్శబ్దంలో సాగకుండా చేస్తున్నాడు"  అని భావించి ఇతని మీద పడ్డారు . ఇతన్ని బాగా తన్నారు . మా ఊరి గూర్ఖా పరిగెత్తి పారి పోకుండా,  ధై ర్యంతో నిలిచి - తన బొడ్డులో ఉన్న కత్తిని బయటికి లాగి దొంగని ఒకడిని ఠక్కున డొక్కల్లో పొడిచాడు. ఈ సంఘటన తరువాత మా అమరావతిలో గూర్ఖా ల పట్ల ప్రేమ పెరిగింది . కొందరు అతనికి ఐదు రూపాయల జీతం గూడా ఇచ్చారు .   మేము ఫది మంది పిల్లలం కలిసి ఒక రూపాయి పోగేసి మా గుర్ఖాకి ఇచ్చి,  ఆ కత్తీ  అదీ చూపించమని  అడిగేవాళ్ళం . అతడిని వెంబడించి అడగ్గా  అడగ్గా ఎప్పటికో ఒకసారి జానా పొడవున్న కత్తి బయటికి తీసి చూపేవాడు. గూర్ఖా వాలా కత్తి మనుషుల ను చూస్తే  అది రక్తం తాగాలని కోరుతుందని - కాబట్టి ఒక  రూపాయి పెట్టి కోడిపిల్లని కొని దాని రక్తం కత్తి కి తాగిస్తాను  " అని హామీ

ఇచ్చేవాడు . కత్తి గుట గుటా  రక్తం తాగటం మేము కలలో చూసి   నమ్మేవాళ్ళము .   " జీతం గా ఒక్కరూపాయి తీసుకుని అయినా సరే  -    ఒక పని చేయటానికి అని ఓ గూర్ఖా  గానీ ఒప్పుకున్నాడు అంటే  -  వాడు ప్రాణాలకు తెగించిఅయినా సరే ఆపని చేస్తాడు " అని మా పెదనాయన గారు తీర్మానించారు .   ప్రాణాలకు తెగించి పనిచేయటం అనేది   వీరి జాతి స్వభావం సహజసిద్ధంగా వచ్చినది అని   గుర్తించిన ఇంగిలీషు   వారు తమ సైన్యములో ప్రత్యేకంగా  గూర్ఖా రెజిమెంట్ ను కూడా ఏర్పాటు చేసాబు.   వారి ధైర్యము వారి జాతిని ప్రత్యేకంగా గుర్తించేట్లు చేసింది . ఇంగిలీషు వారు గూర్ఖా రెజిమెంటు  వారికి శిక్షణ ఇస్తూ -వారికి ఓ పారాషూట్ బిగించి,  విమానంలో నుండి కిందకు దూకండి అని ఆర్డర్ వేయగా -- గూర్ఖాలు కిందకు దూకటానికి తిరస్కరించారని - పారా షూట్ ధరించి దూకటం అంటే  అంటే మేము ప్రాణాల కోసం పాకులాడుతున్నామని అర్ధం -.ప్రాణాలు పోగొట్టు కోవటానికి జడుస్తున్న పిరికి పందలము అని అర్ధం-   అది మా జాతి ధైర్యానికి  మాయని మచ్చ . మాకు పారాషూట్ లు తీసివేయండి .

అప్పుడు మాత్రమే మేము  దూకుతాము " అని గూర్ఖాలు  చెప్పారని - అది విని ఇంగిలీషు వారు నివ్వెర పోయారని - నేను ఒక వార్తా కధనం చదివాను .    గూర్ఖా జాతి వారు నేపాల్ వారు . వీరు  భారత్ లోని  West Bengal   , Assam  , Sikkim  , Uttarakhand లో  లోకి వలసలు వచ్చి అక్కడనుండి భారత్ దేశంలో ని అన్ని చిన్న చిన్న పట్టణాలకు చేరుకొని అక్కడ తమకు తాముగా ఊరి కాపలా డ్యూటీ కి దిగి , అవసరమైనపుడు తమ ధైర్యాన్ని చూపిస్తూ , జీవనోపాధి పొందుతూ వుంటారు .  ఇవాళ్టి కీ  మావూరిలో గూర్ఖా వున్నాడు . ప్రతి నెలా వచ్చి ఇరవై తీసుకుంటాడు . ఇట్లాంటి వసూళ్ల మీద అతనికి నెలకు ఓ పాతిక ముప్పై వేలు దక్కుతాయి అనుకుంటే , అదే అతడు నేపాల్ లో పనిచేసుకుంటే ఇంత కూడా గిట్టు బాటు కాదనే కదా అర్ధము .    నేపాల్ నే నమ్ముకొని బ్రతికే గుర్ఖాలకు నెలకు పది వేలు కూడా దొరకదు. అందుకని గూర్ఖాలు తమ ధైర్యాన్ని  ప్రదర్శించి డబ్బు సంపాదించేటందుకు గానూ ఇండియాకే కాకుండా ఇంకా వేరే  దేశ దేశాలకు వెడుతూ వుంటారు .   ఇప్పుడు రష్యా మరియూ

ఉక్రేన్ మధ్య యుద్ధము కొనసాగుతున్నది కదా ?
రష్యా వారికి  ఆయుధాలు వున్నాయి కానీ తగినంత
సైన్యం లేదు - కారణం మొగ మనుషుల కొరత అని
--సైన్యంలేని ని రష్యా ఓడిపోక తప్పదని అమెరికా
ఆశపెట్టుకున్నది   .  రష్యాలో సైన్యం లో చేరటానికి
జనం లేరన్నది నిజంగా నిజం - అందుకని నేడు రష్యా
దేశము నేపాలీ గుర్ఖాలకు తమ సైన్యములోని
తుపాకీ దళము  లో పని చేయటానికి  ఒక
సంవత్సరము పాటు కాంట్రాక్టు ఉద్యోగాలు ఇస్తూ
వున్నది .   నెలకు ఇరపై వేల డాలర్ల జీతము .
రష్యానుండి ఈ జీతము  డబ్బు తీసుకున్నందుకు
గానూ నేపాలీ గూర్ఖాలు తమ దేశము కాని దేశము
తరఫున అనగా రష్యా తరఫున యుక్రేను తో
యుద్ధము చేస్తూ  ప్రాణ త్యాగాలు చేస్తున్నారు .
ఎప్పుడూ  మీ ఇంటి ముందుకు వచ్చి డబ్బు అడిగే
గూర్ఖా ఉన్నట్లు ఉండి రావటం మానేసినాడంటే -
అతడు రష్యా సైన్యములో చేరి ఉంటాడేమో?  -
అక్కడనే ప్రాణాలు కోల్పోయాడో ఏమో ? అని
అలోచించి అతనికోసం  కాసింత చింతించండి కానీ
వున్నట్లుండి అతడు కనపడితే " సట్ టీక్ హాయ్ క్యా

? అని పలకరించి అతనికి ఒక మంచి చాయ్ ఆఫర్ చేయండి .మీకు విజయం కలుగుతుంది . నేపాలీ ఘోర్ఖాలు రష్యన్ ఆర్మీలో చేరుతూవుండటం అనేది యదార్ధము . దీని గురించి ఒక జాపనీస్ టీవీ ఓ డాక్యుమెంటరీ ప్రసారం చేసి చెప్పింది . అది నిజమేనని నేపాలీ ప్రభుత్వం తరఫున ఒక మంత్రి గారు ఒప్పుకున్నాడు . నేపాలీ గూర్ఖాలు రష్యన్ సైన్యంలో చేరకూడదంటూ చట్టం తెస్తాము అన్నాడు . "మా గూర్ఖా కనపడుట లేదు ' ఏమయినాడో ఏమో ? అని నేను ఆలోచిస్తూ వున్నపుడు - పై వార్త విని దానిని పట్టి - మా గూర్ఖా రష్యా మిలిటరీ లో చేరి నాడో ఏమో ? నని అనుకున్నాను . మళ్లాతిరిగి కనపడటానికి ప్రాణాలతో వున్నదో లేడో అని కూడా అనుకున్నాను . మీకు కూడా మీ గూర్ఖా కనపడక పోతే కూడా ఇట్లాగే ఆలోచించండి . అతడు కనపడితే బాగా సంతోషించండి . చాయి ఇవ్వండి నమ్మతగిన ఫారెన్ టీవీ ఛానెల్ లో వచ్చిన వార్తల ఆధారంగా - వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి రచన .

---

## 18."అంతా అలాగే ఉంది కాని ఇచ్చే ఫీ కాస్త ఎక్కువైంది 24-02-24

నేను 23 --02 -24 న మాగూర్ఖా కనపడుట లేదు అని ఒక పోస్టు పెట్టగా - పాఠకులు ఒకరు స్పందించి "అంతా అలాగే ఉంది కాని ఇచ్చే ఫీ కాస్త ఎక్కువైంది" అని ఒక అద్భుతమైన కామెంట్ పెట్టారు . కామెంట్ అద్భుతం ఎందుకు అయ్యింది అంటే
అది నన్ను కొత్త దిక్కులకు ఆలోచించేట్లు చేసింది . "ఫీ కాస్త ఎక్కువైంది" అనుటలో వారి జీతము కాస్త ఎక్కువ అయ్యింది అని .
"మాగూర్ఖా కనపడుట లేదు" అన్న పోస్టులో నేను , రష్యా దేశము నేపాలీ గుర్ఖాలకు తమ సైన్యములోని తుపాకీ దళము లో పని చేయటానికి ఒక సంవత్సరము పాటు కాంట్రాక్టు ఉద్యోగాలు ఇస్తూ వున్నది . నెలకు ఇరవై వేల డాలర్ల జీతము" అని రాసాను .
పై కామెంట్ మూలకంగా నేను ఆలోచనలో పడి - అసలు ఎందుకు ఇంత జీతం ఇస్తున్నారు అని లోచించి

పరిశోధించి కొంత తెలుసుకున్నాను .అది రాస్తున్నాను
.

సగటు ఆయుర్దాయము అనే మాట ఒకటుంది . ఇండియా ప్రజల సగటు ఆయుర్దాయము - 76.9 సంవత్సరాలు, దీని అర్ధము దేశంలో పెరిగిన ఆరోగ్య ఆహార వసతుల వల్ల భారతీయ ప్రజలు సగటున ,76.9 సంవత్సరాల కాలం పాటు జీవించి ఉంటారని, భారతీయులకు యుద్ధాలు ఈతి భాధలు వంటి సంకటాలు ఏమీ లేవని .1947 వత్సరంలో భారతీయుల సగటు ఆయుర్దాయము 42 యేండ్లు . ఈ గణాంకాలు భారత్ గొప్ప దేశము అన్న అభిప్రాయం కలగ చేస్తాయి .ఇదే అమెరికాలో అయితే మొగవారి సగటు ఆయుర్దాయము 73.2 years, మరియూ ఆడవారికి 79.1. సంవత్సరాలు . ఇట్లగా మనము అమెరికా కన్నా గూడా గొప్పవారము .

దేశజనాభా సగటు ఆయుర్దాయాలే కాక ఏదన్నా ఒక వృత్తిలో వున్నా వారి సగటు ఆయుర్దాయము కూడా లెక్క వేస్తారు . ఏ వృత్తిలో అయితే సగటు

ఆయుర్దాయము తక్కువగా ఉందొ. ఆ వృత్తి లోచేరి న వ్యక్తి తొందరగా చనిపోటానికి అవకాశాలు పెరుగుతవి అని అర్ధము . విమానాలు నడిపే పైలట్ ల సగటు ఆయుర్దాయము 83.8 సంవత్సరాలు . కారణము వారి మెదడు చురుకుగా వుండటము . అంతేకాక, ఒక పైలట్ తప్పు చేస్తే కోట్లాది డాలర్ల విమానము కూలి బూడిద అవుతుంది . వందల మంది మరణిస్తారు . అందువల్ల విమాన కంపెనీలు వీరిని ఆరోగ్యం గా ఉంచటం కోసం అని, వారిని స్ట్రెస్ నుండి తప్పించటం కోసం అని , ఎన్నో సౌకర్యాలు కలుగ చేస్తాయి . అందువల్ల వీరు అందరిలాగా 60 కి రిటైర్ అయినా కానీ సగటున 83 యేండ్లు బ్రతుకుతారు . దీనిని బట్టి ఈ ఉద్యోగంలో చేరి పనిచేయటం మంచిదేనని యువకులు భావించుతారు .

ఇక ఇండియా లో వున్న డాక్టర్లు సగటున 55 to 59 సంవత్సరాలే బ్రతుకుతారు ఎందుకంటే డాక్టర్ వృత్రిలో వున్నా టెన్షన్ అలాంటిది . దీనిని పట్టి డాక్టర్ వృత్తి నిజంగా అంత మంచిది కాదేమో అని యువకులకు అనిపించవచ్చు .ఇట్లా చూస్తే డాక్టర్ వృత్తి కన్నా పైలట్

వృత్తి  కోరుకో దగ్గది అవుతుంది .ఇట్లా చూసుకుంటూ పోతే ఎక్కువగా  కోరుకో తగని  వృత్తి ఏమిటో కూడా బయట పడుతుంది .

సగటు ఆయుర్దాయాన్ని లెక్కలోకి తీసుకుంటూ ఆలోచిస్తే  - చేరకూడని వృత్తి  సైనిక వృత్తి . సైనికుని విషయానికి వచ్చేసరికి అతని సగటు ఆయుర్దాయాన్ని - "అతడు , ఒక యుద్ధములో పాల్గొంటే "అతడు యుద్ధములో పాల్గొంటూ ఎంతకాలం జీవించి ఉండటానికి ఎంత అవకాశం వున్నది?"  అన్న కోణంలో లెక్క వేస్తారు .సైనికుని సగటు జీవనకాలము అతడు పాల్గొన్న యుద్ధమును బట్టి, అతడు ఏ రకపు సైనికుడు అనే దాన్ని  బట్టి  వుంటున్నది .    రెండో ప్రపంచ యుద్దములో పాల్గొన్న పదాతి దళపు సైనికుని సగటు జీవన కాలము మూడు వారాలు . అంటే యుద్ధము చేస్తూ వున్న సైనికుడు మూడు వారాల తరువాత చనిపొయ్యే అవకాశాలే ఎక్కువ అని . వియత్నాంకు యుద్దములో పాల్గొన్న  అమెరికన్ సైనికుడు యుద్ధము చేస్తూ  జీవించే సంగటు కాలము 24  నెలలు. అంటే వియత్నాం   యుద్ధము చేస్తున్న

సైనికుడు ఒక 24  నెలలతదుపరి  మరణించే అవకాశాలే ఎక్కువ అని.

ఇలా చూసుకుంటూ వస్తే ప్రస్తుతం జరుగుతున్న ఉక్రేన్ రష్యా యుద్ధములో - ఉక్రేన్ తరఫున యుద్ధములో పాల్గొంటున్న ఉక్రేనియన్ సైనికుని సగటు జీవిత కాలము నాలుగు గంటలు . ఇదే యుద్ధములో ఒక రష్యాను సైనికుని సగటు జీవిత కాలము  నాలుగున్నర నెలలు . అంటే ఈ సైనికుడు ఆతరువాత చనిపోయే అవకాశాలే ఎక్కువ .

నేపాల్ నుండి రష్యా వెళ్లి,  రష్యా సైనములో చేరే గూర్ఖా - యుద్ధములో కి దిగినాక సగటున నాలుగున్నర నెలలకన్నా ఎక్కువకాలం  బ్రతికి వుండే అవకాశం లేదు .  . అందువల్ల ఒక నేపాలీ గూర్ఖా  రష్యా సైనికునిగా చేరటం అంటే కేవలం  నాలుగున్నర నెలలోనో అంతకు తక్కువ కాలంలోనే  ప్రాణాలు పోగొట్టుకోవటానికి సిద్ధపడిన వ్యక్తి  అని అర్ధము . తమ దేశం కోసం పోరాడే రష్యన్ సైనికులకు  ప్రభుత్వమూ నుండీ ఎంతో గౌరవము దక్కుతుంది . మరి  నేపాలీ వారికి ఎమన్నా గౌరవము దక్కుతుందా ? వీరికి ఏమీ

గౌరవము దక్కదు .  అందువల్ల వీరిని ఆకర్షించటానికి అని --రష్యా       నేపాల్ నుండి వచ్చి తమ సైన్యములో చేరిన గుర్ఖాలకు  20  వేల అమెరికన్ డాలర్ల నెలసరి జీతం ఇస్తున్నది .  ఇవాళ్టి లెక్కలో ఒక అమెరికన్ డాలర్కి నేపాలులో 133  రూపాయలు వస్తాయి.
20000X 133 = 266000  జీతము .
తర్కించి చూస్తే , ఒక నేపాలీ గూర్ఖా అంటే -  నెలకి 266000 .జీతము కోసము నాలుగున్నర నెలలు మాత్రమే బ్రతికి ఉండటానికి సిద్ధబడిన ధైర్యస్తుడని అర్ధము. వీరి ధైర్యానికి "ఫీ కాస్త ఎక్కువైంది" అని లేదా "ఎక్కువైందా  ?" అని కూడా ఆలోచించుకోవచ్చు

వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి రచన

